


జె. బి.

# సాల్టో

బిస్కట్లు




రుచిగా, ఎల్లప్పుడూ కరకర లాడుతూ ఉండే జె. బి. సాల్టో బిస్కట్లు యిప్పుడు సొగసైన రంగులుగల 450 గ్రాముల డబ్బాలలో ప్యాకుచేయబడినవి. సాల్టో బిస్కట్లను తినండి మరియు డబ్బాలను యింట్లో వాడుకోండి!

**జె. బి. మంఘారామ్ అండ్ కంపెని**

గ్వాలియర్

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# చందమామ

రాబోవు సంచిక

## దీపావళి ప్రత్యేక సంచిక

★ ఎక్కువ పేజీలతో

★ అదనపు కథలతో

★ ఆకర్షవంతమైన రంగు రంగుల వాష్ చిత్రాలతో

★ ముచ్చట గొలిపే ముఖ చిత్రంతో అత్యంత మనోహరంగా వెలువడుతున్నది.

★

**వెల 75 న. పైసలు**

★

ప్రకటనదార్లకు ఇది మంచి తరుణం.

★

వివరములకు:

చందమామ పబ్లికేషన్స్,

వడపళని :: మదరాసు-26.




అఫ్ఘన్ స్నో
సౌందర్య పరికరాలు
మీ ముఖ వర్చస్సునూ,
శరీరచ్ఛాయనూ,
శిరోజాలనూ, గోళ్ళనూ
సౌకుమార్యముగా సంరక్షించును...
మీ సౌందర్య సమస్య లన్నింటినీ
పరిష్కరించుకోండి....

## అఫ్ఘన్ స్నో

సౌందర్య పరికరాలు

తయారు చేయువారు:

ఇ. ఎస్. పటన్‌వాలా,

బొంబాయి - 77.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో మరొక "ఖలీఫా" కథ, "రాజైన బానిస పిల్ల" ప్రారంభమవుతున్నది. "అన్నా చెల్లెలు" కథ లాగే పాఠకులకు ఈ కథ కూడా ఆనందాన్ని చేకూర్చుతుందని ఆశిస్తున్నాము.

కిందటి నెల "కార్టూను" లేనందుకు చాలామంది పాఠకులు ఆశాభంగం చెందినట్టు రాశారు. ఈ నెల కూడా వారికి ఆశాభంగం తప్పదు. స్థలం చాలని కారణం చేతనే కార్టూను వెయ్యలేక పోయాము.

మరవకండి. వచ్చే "చందమామ" సంచిక దీపావళి ప్రత్యేక సంచిక. అందులో మరో 16 పేజీల రంగుల బొమ్మలుగల కథా, 8 పేజీల చిత్రకథా ఉంటాయి. సంచిక అందంగా తయారు చేస్తున్నాము.

సంపుటి : 31 అక్టోబర్ 1962 సంచిక : 4

Sankar...



# భారత చరిత్ర



గౌడ వంగ దేశాలు అతి ప్రాచీన మైనవి, పురాణ కాలం నాటివి. మౌర్యుల, గుప్తుల కాలంలో ఇవి మగధ సామ్రాజ్యంలో చేరి ఉండేవి. 7, 8 శతాబ్దులలో గౌడదేశం కన్యాకుబ్జ, కాశ్మీర దేశాలతో సమాన ప్రతిభ కనబరిచింది. పాలవంశపు రాజులు బెంగాలును చరిత్రప్రసిద్ధం చేశారు. పాలవంశ మూలపురుషుడు గోపాలుడు "వంగపతి" అనీ, "గౌడేశ్వరు" డనీ కూడా ఖ్యాతి కన్నాడు. ఇతని కొడుకు ధర్మపాలుడు 8వ శతాబ్దం ఉత్తరార్థంలో రాజ్యానికి వచ్చాడు. ఇతని పరిపాలనలో ప్రాచీన పాటలీపుత్రం తిరిగి శోభ పొందింది. ఇతని పరిపాలన హిమాలయాల నుంచి దక్షిణాన గోకర్ణం వరకూ సాగిందట. కాని మధ్య దేశంలో ఇతని ప్రభావాన్ని (కన్నడ) రాష్ట్రకూటులూ, పశ్చిమం నుంచి ప్రతిహారులూ భగ్నంచేశారు. ఇతను జయించిన కన్యాకుబ్జం 836కు ముందే ప్రతిహారుల వశమయిపోయింది.

ధర్మపాలుడి కొడుకు దేవపాలుడు పశ్చిమ, దక్షిణ దేశాలతో యుద్ధాలు సాగించాడు. సువర్ణద్వీప (సుమత్రా) రాజైన బాలపుత్రదేవు డితని వద్దకు రాయబారిని పంపాడు. ఇతని అనంతరం పాలవంశ ప్రతిభ సన్నగిల్లింది. తరవాత బెంగాలులో ప్రతిహారులూ, కాంభోజులూ కూడా అధికారం చలాయించారు. అయితే 11వ శతాబ్దంలో మొదటి మహీపాలుడు పాలవంశ ప్రతిష్ఠను పునరుద్ధరించాడు. కాని 12వ శతాబ్దంలో విజయసేనుడనే కర్ణాట రాజు బెంగాలును ఓడించి తన పరిపాలనను అక్కడ ప్రతిష్ఠించుకున్నాడు.

కన్యాకుబ్జాన్ని పాల వంశం నుంచి లాక్కున్న ప్రతిహారులు లక్ష్మణుడి సంతతి వారమని చెప్పుకున్నారు. ప్రతిహార రాజు

## 13. పాలులు, ప్రతీహారులు, పల్లవులు

లలో మొదటి భోజుడూ, అతని కొడుకు మొదటి మహేంద్రపాలుడూ ముఖ్యులు. 1018లో కన్యాకుబ్జంలో రాజ్యపాల ప్రతిహరుడు రాజ్యం చేస్తూండగా ఘజ్నీ మహమ్మద్ దండయాత్ర జరిగింది. అటుతరవాత ప్రతిహర వంశీయులు అక్కడా యిక్కడా కేవలం చిల్లర రాజులుగా మాత్రమే కాలం గడిపారు.

క్రీ. శ. 2 వ శతాబ్దాంతంలో గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణితో సాతవాహనుల ప్రతిభ సన్నగిలింది. వారి స్థానాన్ని ఇక్ష్వాకులూ, బృహత్ఫలాయనులూ, శాలంకాయనులూ ఆక్రమించారు. బీరారు ప్రాంతాల వాకాటకులు పైకివచ్చారు.

సముద్రగుప్తుడు దక్షిణ దిగ్విజయానికి వచ్చేనాటికి వింధ్యకు దక్షిణాన ఏలుతూ వుండిన ముఖ్య రాజవంశాలు వాకాటకులూ, ఇంకా దక్షిణంగా పల్లవులూనూ.

4 వ శతాబ్దం మధ్యలో విష్ణుగోప పల్లవుడనే రాజు సముద్రగుప్తుడికి ఓడిపోయి విడిచిపుచ్చబడ్డాడు. పల్లవ రాజులలో ప్రసిద్ధుడుగా చెప్పబడి, అశ్వమేధం చేసినవాడు శివస్కందవర్మ.

పల్లవరాజుల రాజధాని కంచి. వారిలో అనేకమంది తెలుగు, కన్నడ ప్రాంతాలను



కూడా పాలించారు. క్రీ శ. 436 లో సింహవర్మ అనే పల్లవరాజు రాజ్యానికి వచ్చినట్టు దాఖలా ఉన్నది.

అయితే 6 వ శతాబ్దం ఉత్తరార్థంలో సింహవిష్ణు అనేవాడు రాజయినాక పల్లవ చరిత్ర వివరాలు స్పష్టంగా ఉన్నాయి. ఇతను చోళరాజ్యాన్నీ, దక్షిణప్రాంతాన్నీ, లంకనూకూడా వశపరచుకున్నాడట. ఇతను వైష్ణవుడు. ఇతనూ, ఇతని ఇద్దరు భార్యలూ గల చెక్కడం ఒకటి మహాబలిపురంలో ఈ నాటికీ ఉన్నది.

సింహవిష్ణు కుమారుడు మొదటి మహేంద్రవర్మ. ఇతని కాలంలోనే దక్షిణాధిపత్యం

కోసరం పల్లవులకూ, వాతాపి ఏలిన చాళు క్యులకూ ఘర్షణ ఆరంభమై, అనేక తరాల పాటు సాగింది. రెండవ పులకేశి అనే చాళుక్యరాజు పల్లవులను ఓడిస్తే, మహేంద్రవర్మ కుమారుడైన మొదటి నరసింహ వర్మ చాళుక్యులను ఓడించాడు. రెండవ పులకేశి కొడుకు మొదటి విక్రమాదిత్యుడు పల్లవులపై యుద్ధంచేశాడు. 8 వ శతాబ్దంలో అతని ముని మనమడైన రెండవ విక్రమాదిత్యుడు పల్లవులను ఓడించి కంచిని స్వాధీనపరచుకున్నాడు.

పాండ్యులుకూడా పల్లవులపై దండెత్తి కావేరీ తీరందాకా జయించారు. చివరకు 9 వ శతాబ్దం అంతంలో ఆదిత్యచోళుడనే వాడు అపరాజిత పల్లవుణ్ణి ఓడించి పల్లవ వంశాన్ని పదభ్రష్టంచేశాడు.

భారత చరిత్రలో పల్లవుల పాత్ర చారిత్రకంగానూ, సాంస్కృతికంగానూ చెప్పుకోదగినది. దక్షిణాపథంలో ఒక గొప్ప సామ్రాజ్యాన్ని వారు మొదటగా నిర్మించారు. వారి ప్రతిభ లంక (సింహళం) దాకా ప్రసరించింది. వారి కాలంలో అనేకమంది (వైష్ణవ) ఆళ్వారులూ, (శైవ) నయనారులూ కీర్తి గడించారు. వారికాలంలో కంచి ; బ్రాహ్మణ, బౌద్ధ సంస్కృతులకు కేంద్రమయింది. "విచిత్ర చిత్త" అనే బిరుదుగల మొదటి మహేంద్రవర్మ గుహా శిల్పాల పద్ధతి అమలు చేశాడు. ఆయన "మత్తవిలాస ప్రహసనం" అనే హాస్యనాటకంకూడా రచించాడు. పుదుక్కోట సంస్థానంలోని ఒక గుహలో కనిపించిన చిత్రరువులు ఇతని కాలానివేనని నిర్ణయించారు. ఇతని కొడుకు నరసింహవర్మ మహామల్లుడు. ఇతని పేరనే మహాబలిపురం (మహామల్లపురం) ఏర్పడింది. ఇక్కడి శిల్పాలను చూడటానికి జనం దేశదేశాల నుంచి వస్తారు. రాజసింహనరసింహవర్మ అనే పల్లవరాజు కంచిలో కైలాసనాథాలయం కట్టించాడు.





# కుమారసంభవము

తృతీయాశ్వాసము :

గగన లక్ష్మి తన మోమును
కనుగొన, శరవణ సరస్సు
నిద్దపు గంగా జలముల
అద్దమువలె కనిపించెను!

స్నానమాడి మునిపత్నులు
జలముల గొని పోవుచుండ్రు;
కల హంసల గుంపు వారి
కాళ్ళ కడ్డు పడుచుండును.

ఆ కొలనికి ఒకవైపున
ఆకాశము నంటునట్లు
తెల్లు పొదలు తెలతెల్లగ
వెల్లివిరిసినవి పెల్లుగ.

అచట నున్న సప్తఋషులు
అమావాస్య హోమమొకటి
ఆచరింప దలచినారు,
అగ్నిని పిలిపించినారు.

భార్యతోడ అగ్ని యటకు
పయనంబై వచ్చినాడు;
అచట నున్న కొలని గాలి
హాయికి మది మెచ్చినాడు.

మును లగ్నిని గౌరవించి
మొదలుపెట్టిరా హోమము;
ఆహుతులను దేవితలకు
అందించుచునుండె సతడు.

మునిపత్నులు తమ పతులకు
వెనుకగ కూర్చుండినారు;
చేతనైన పరిచర్యలు
చేయ దొడగుచుండినారు.

ముచ్చటైన మునిపత్నుల
ముఖములు, తీరైన కనులు,
ఒయ్యారపు నడ లగ్నికి
తియ్యములై కనిపించెను!

ఉత్పల సత్యనారాయణాచార్య

చేరువయగు మునిపత్నుల
చెఱగు పట్టుకొన దలంచు;
మునులు చూచి నపుడాతడు
ముచ్చముడిగి కూర్చుండును.

మును లిచ్చెడి ఆహుతులను
గొని యాతడు దేవతలకు,
ఒకరి కీయదగినవి ఇం
కొకరి కిచ్చుచుండినాడు.

స్వాహా సతి తనదు మగని
వాలకమును కనిపెట్టెను;
మునిపత్నుల యెడ నాతని
మోహమ్మును పసికట్టెను.

హోమము సంపూర్తియయ్యె;
హోతలు దేవత లరిగిరి;
మునులకన్న మునిపత్నులు
ముందుగ ఇండ్లకు వెళ్ళిరి.

అగ్నిదేవు ముఖమెల్లను
అంతట వెలవెల బాఱెను;
హోమకుండమందు నుండి
ఉస్సురుమని తా లేచెను.

శిరము వంచి, నేరుగ ఆ
శరవణ కాసారమునకు
వెళ్ళి, యొక్క రాతి మీద
వేగుచు కూర్చుండినాడు.

అంతలోన ప్రొద్దుక్రుంకె,
అంబుజములు ముకుళించెను,
హంసలు తిన్నని నడకల
ఆశ్రమముల దారిబట్టె.



నా డమావసి సందె చీకటి
నాల్గు దిక్కుల నలముకొన్నది ;
మింటి చుక్కలు సరసిలోనను
మినుకు మినుకని మెఱయుచున్నవి !

తీరమందలి ముని గృహంబుల
దీపకళికలు వెలుగుచున్నవి ;
కొలని లోపల సద్దు సేయక
అలలు మిలమిలలాడుచున్నవి.

అంత స్వాహాదేవి. భర్తను
అరయ నయ్యెడ కరుగుదెంచెను ;
మగని నచ్చట చూచి అల్లన
నగుచు మెల్లగ వెళ్ళిపోయెను.

వెళ్ళి అంగిరు ధర్మపత్నిగ
వేష మింపుగ తాను దాల్చెను ;
అగ్నిహోత్రుం డున్నచోటికి
అల్ల నల్లన వచ్చి నిల్చెను.

ఆమె నత డాకస్మికమ్ముగ
అచట కని దిగ్భ్రాంతి చెందెను ;
పగట జూచిన అంగిరసు ముని
పత్నియని భావించి లేచెను.

"ఓ వధూమణి ! నీ వెవర్తెవొ
ఒంటిపాటున ఇట నొకర్తువు
నేటి రాత్రి అమాస చీకటి
నిర్భయుంబుగ తిరుగుచుంటివి."

అనిన నవ్వుచు ఆమె ఇట్లనె :
"అగ్నిహోత్రులు మీరలుండగ
నాకు ఒంటరితన మదేటికి ?
చీకటికి భయమొంద నేటికి ?"



ఓహెూహెూ! యని అగ్నిహెూత్రుడు
ఉవిద! ఎంతో చతురురాలవు!
అల్ల అంగిరు ధర్మపత్నివి—
ఔన? నీ వని అడిగె నప్పుడు.

ఆమె ఔనని శిరము వంచెను,
ఆతనిని క్రేగంట జూచెను;
హస్తమందలి కలువ పూవును
అట్టు నిటు నాడింపదొడగెను.

అగ్నిహెూత్రుడు అత్రమొందుచు
అడిగె నీ పేరేమిటంచును,
సిగ్గుతో తలవంచి నవ్వుచు
చెప్పె నాయమ 'శ్రద్ధ' యంచును.

అహహ! యని యతడు, నాదగు
ఊహయే నిజమైన దనగా,
ఒక్క నిమిషం బాగి ఆయమ
చెక్కిటను చెయిచేర్చి ఇట్లనె:

"అగ్నిహెూత్ర! క్షమింపవలయును;
అన్యముగ భావింపకుండిన
విన్నవింతును ఒక రహస్యము,
నన్ను చుల్కన చేయకుండిన.

హెూమమున నినుచూచి యెంతయు
కామ పీడితలైనవారము;
ఏడుగురు మునిపత్నులము నిను
వేడుకొనగా తలచినారము.

నీ మనస్సెటువంటిదో యని
నేను తొలగ వచ్చియుంటిని—"
అని యికేమియు నామె పలుకక
ఆతనిని వాల్గనుల జూచెను.

కామమోహితుడైన పురుషుడు
కన్నులుండియు కానజాలడు;
తా తమోపహుడైన గానీ
తనకు స్వపరజ్ఞానముండదు. (సశేషం)






## 16

[ఇద్దరు కోయయువకులు తోడుగా బయలుదేరిన కేశవుడూ అతడి అనుచరులు, బ్రహ్మపుర సైనికుల కనుగప్పి, ఒక కొండ సొరంగం నుంచి ప్రవహిస్తున్న నదీ జలం ద్వారా, ఒక జలపాతంలోకి దూకి, సురక్షితంగా నది ఆవలి తీరానికి ఈదసాగారు. కాని, వాళ్లు నదీ తీరాన్ని చేరుతూనే, దాని ఒడ్డున కొందరు ఆటవికుల్ని చూశారు. తరవాత—]

నది ఒడ్డున నిలబడి తమ కేసే చూస్తున్న ఆటవికుల్ని చూస్తూనే, కోయయువకులు కీచుమన్నారు. ఆ ఆటవికులు తమ జాతి వాళ్ళు కాదు. వాళ్ళకూ తమకూ జాతి వైరం వున్నది. తాము వాళ్ళ కంటబడటం అంటే పోరు తప్పదు. జలపాతంలో నుంచి నదిలోకి పడినప్పుడు, తమ ఆయుధాలన్నీ—ఒక కత్తి తప్ప—నీటిపాలైనవి.

"జ్యేష్టా, కనిష్ఠా! మీ ఆయుధాలన్నీ సురక్షితంగా వున్నవా? ఈ ఆటవికులు శత్రువులో, మిత్రులో తెలియటం లేదు. వాళ్ళు మొత్తం ఐదుగురికన్న ఎక్కువ లేరు. పోరు తప్పకపోతే, మన ఆయుధాలే మనకు రక్షణ!" అన్నాడు కేశవుడి ముసలితండ్రి.

కేశవుడూ, జయమల్లూ కూడా తమ నడుముకు వేలాడుతున్న కత్తులు తప్ప, సర్వం పోగొట్టుకున్నారు. ఒడ్డున నిలబడి తమ కేసి చూస్తున్న ఆటవికుల దగ్గిర బాణాలున్నట్టులేవు. అలాంటి పరిస్థితిలో తమను వాళ్ళు దూరాన్నుంచి ఏమీ చెయ్యలేరు.



జయమల్లూ, కేశవుడూ యిలా ,ఆలోచిస్తూ కాళ్ళకు నేల తగలగానే, ఈతమాని, ఒడ్డు కేసి నడవసాగారు. అంతలో ఆటవికుల్లో ఒకడు వెనుదిరిగి పెద్దగా కేక వేశాడు. ఆ వెంటనే ఒక పెద్దరాతి చాటు నుంచి పులిచర్మం తలకు కట్టుకునివున్న, ఒక స్థూలకాయుడు అక్కడికి వచ్చాడు. అతడి దృష్టి నీటిలో నుంచి ఒడ్డుకు వస్తున్న కేశవుడూ వాళ్ళ మీద పడింది. వెంటనే అతడు అదిరిపడుతూ, "అయిదుగురు జమాజట్టీల్లాంటి వెధవలు! వీళ్ళందర్నీ పట్టుకోవటం మన వల్ల ఎలా అవుతుంది? వాళ్ళను కూడా కేకవేయండి!" అన్నాడు.

"జ్యేష్ఠా, కనిష్ఠా! ఈ దుర్మార్గుల పని మీరు చూడండి. ఈలోపల వీళ్ళకు సహాయం వచ్చే ఆ నీచుల్ని మేం పరలోకయాత్రకు పంపుతాం," అంటూ ముసలివాడు ఒడ్డు మీదికి ఎగిరి చెట్ల కేసి పరిగెత్తాడు. అతడికి వెనకగా కోయయువకులు కూడా పరిగెత్తారు. కేశవుడూ, జయమల్లూ ఒడ్డుకు చేరి కత్తులు దూసే లోపలే ఆటవికులు అయిదుగురూ వాళ్ళ మీదికి ఉరికారు. స్థూలకాయుడు అటూ యిటూ గెంతుతూ, రొప్పుతూ, "మంచి గిత్తల్లాంటి కుర్రాళ్ళు. కాళ్ళూ చెయ్యీ విరిచారో, మీ ప్రాణాలు తీస్తాను. ఒక్క గాయం కాకూడదు, ఒక్క దెబ్బ తగలకూడదు. జాగ్రత్తగా పట్టుకోండి," అని అరవసాగాడు.

ఆటవికులు అయిదుగురూ సుడిగాలిలా వచ్చి మీదపడటంతో, కేశవుడికీ, జయమల్లుకూ కూడా ఆత్మరక్షణకు తమ కత్తులు ఉపయోగించే అవకాశం లేకుండాపోయింది. వాళ్ళు ఆటవికుల్ని ఎదుర్కొని పిడికిళ్ళతో పొడుస్తూ, కాళ్ళతో వాళ్ళ డొక్కల్లో బలంగా తన్న సాగారు. ఆటవికులు మాత్రం వాళ్ళను తిరిగి బలంగా కొట్టకుండా, కాళ్ళు పట్టుకుని కింద పడవేసేందుకు ప్రయత్నించారు. కొద్ది నిమిషాల్లో వాళ్ళ ప్రయత్నం ఫలిం

చింది. కేశవుణ్ణీ, జయమల్లునూ ఇద్దరేసి కాళ్ళు పట్టుకుని కిందకు పడదోసి, తాళ్ళతో వాళ్ళ చేతుల్ని బిగించి కట్టారు.

ముసలివాడూ, కోయయువకులూ పరిగెత్తిన చెట్ల ప్రాంతాన్నుంచి పెద్దగా అరుపులూ, పెడబొబ్బలూ వినిపించసాగినై. "అవసరం అయితే చంపండి. కాని, ప్రాణాలతో పారిపోనీకండి!" అంటూ ఒక కంఠం భీకరంగా గర్జిస్తున్నది. తన తండ్రి, కోయయువకులూ ప్రమాదంలో చిక్కుకున్నారని కేశవుడు గ్రహించాడు. కాని, తను యిప్పుడు నిస్సహాయుడు......



ఆటవికుల నాయకుడైన స్థూలకాయుడు చేతులు కట్టబడివున్న కేశవుణ్ణీ, జయమల్లునూ పరీక్షగా చూస్తూ, "దుక్కల్లాంటి కుర్రాళ్ళు! నా నౌకర్లు అయిదుగురినీ వట్టి చేతులతోనే చావ చితకకొట్టారు!" అంటూ నవ్వసాగాడు.

"మా కత్తులు మా కిచ్చి, నీ నౌకర్లూ నువ్వూ కూడా రండి, పోరాడదాం!" అంటూ కేశవుడు పులిలాగా గర్జించాడు.

స్థూలకాయుడు ఆ మాటలకు నవ్వుతూ, "కత్తులూ, బాణాలూ ఉపయోగిస్తే ఎవరో ఒకళ్ళు చావక తప్పదు. చాలా ధన నష్టం!" అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళ కాక్షణంలోనే తాము ఎలాంటి దుర్మార్గుల చేత బందీ చేయబడ్డారో అర్థమైంది. వీళ్ళు మనుషుల్ని పట్టుకుని బానిసలుగా అమ్మే నరరూప రాక్షసులు! అందుకే తమను ఏ మాత్రం గాయపరచకుండా జాగ్రత్తగా పట్టుకున్నారు.

"మా అయ్యా ఏమయినట్టు? అక్కడ అంతా నిశ్శబ్దంగా వున్నదే!" అన్నాడు కేశవుడు అదుర్దాగా.

జయమల్లు నిస్పృహగా తలాడిస్తూ, "మీ అయ్యా, ఆ కోయయువకులూ కూడా



మనలాగే యీ దుర్మార్గులికి దొరికిపోయి వుంటారు," అన్నాడు.

చెట్ల ప్రాంతం నుంచి హఠాత్తుగా పెద్ద చావుకేక వినిపించింది. అందరూ అటుకేసి తలలు తిప్పారు. చూస్తూండగానే నలుగురు ఆటవికులు తమ అనుచరు లిద్దరిని తలా, కాళ్ళూ పట్టుకుని మోసుకుంటూ అక్కడికి వచ్చారు. స్థూలకాయుడు వాళ్ళను చూస్తూనే పళ్ళుకొరికి, "రెండు చావులా? వీళ్ళ తోటి వాళ్ళు, ఆ ముగ్గురూ ఏమయారు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా, వాళ్ళని గాయపరచకుండా పట్టుకుందామని ప్రయత్నిస్తే, ఆ దుర్మార్గులు తమ దగ్గిరవున్న కత్తుల్తో, ఈ ఇద్దర్నీ నరికారు, మరిద్దర్ని గాయపరిచారు. వాళ్ళు నది ఒడ్డునే పడి పారిపోతూంటే, మన వాళ్ళు తరుముతూ పరిగెత్తారు," అని చెప్పాడు ఆటవికుల్లో ఒకడు.

స్థూలకాయుడు పట్టరాని కోపంతో గున్న ఏనుగులా నిలువెల్లా వణుకుతూ, "మన వాళ్ళు నలుగురు చస్తే, ఇద్దర్ని పట్టుకున్నామన్న మాట! అంటే రెండు జీవాలు నష్టం! ఇలా అయితే వ్యాపారం సాగినట్టే, ఛీ, శుంఠల్లారా!" అంటూ గంతులేశాడు.

అతడి అనుచరులు కాసేపు తలలు వంచుకు వూరుకుని, తరవాత మెల్లిగా, "అయ్యా, ఆ గాయపడ్డ యిద్దర్ని కూడా మోసుకుపోవాలిగదా, వీళ్ళను కాస్త తోడు రమ్మనమనండి," అంటూ కేశవుణ్ణీ, జయమల్లునూ పట్టుకున్న వాళ్ళకేసి చూశారు.

ఈ మాటల్తో స్థూలకాయుడు గూటాంలా ఎగిరిపడి, నిప్పులు చెరిగే కళ్ళతో, తన నౌకర్ల కేసి చూస్తూ, "మీరు చేసిన వెధవ పనికి, మరికొందరు తోడుకూడా కావాలా? ఆ గాయపడ్డ పిరికికుంకలు, గుడారాల దగ్గిరికి నడిచిరాలేరా?" అని కేకలు పెట్టాడు.

"వాళ్ళు బాగా గాయపడ్డారు. ఒకడికి గొంతులో కత్తి దెబ్బ తగిలింది, రెండో



వాడికి డొక్కల్లో కత్తిపోటు పడింది. ఇప్పుడో యింకా సేపటికో అంటున్నారు..."

నౌకరు మాట పూర్తిచేయక ముందే స్థూలకాయుడు కీచుగొంతుతో పెద్దగా అరిచి, "చచ్చినవాళ్ళనూ, చావు బతుకుల్లో వున్నవాళ్ళనూ పోషించటానికా నేను వ్యాపారం చేస్తున్నది? ఈ శవాలనూ, ఆ గాయపడ్డ వాళ్ళిద్దర్నీ నదిలోకి విసిరేసి, వేగిరం రండి. ఈ నెత్తురు వాసనకు యిక్కడికి సింహాల ముంద వచ్చినా రావొచ్చు," అన్నాడు.

"ఛీ, నువ్వు మనిషివి కాదు, రాక్షసుడివి! ప్రాణాలతో వున్నవాళ్ళను, నీటిలోకి తోయించుతావా?" అంటూ కేశవుడు బిగ్గరగా కేకపెట్టి, తన చేతి కట్లను తెంచుకునేందుకు ప్రయత్నించాడు.

కేశవుడి ఛీత్కారం వింటూనే స్థూలకాయుడు చిరునవ్వు నవ్వి, "కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతూండేవాడు, నేల మీద చస్తేనేం, నీటిలో చస్తేనేం? పైగా నెత్తురు చూశానో, నా హృదయం తల్లడిల్లిపోతుంది. నాది చాలా మెత్తని మనసు. మీకు ఒక్క దెబ్బ తగలకుండా, చిన్నగాయం కాకుండా ఎంత జాగ్రత్తగా పట్టుకున్నానో చూశారు గదా?" అన్నాడు.

ఆ నరరూపరాక్షసుడి మాటలకు ఏమని జవాబు చెప్పాలో కేశవుడికీ, జయమల్లుకూ అంతుపట్టలేదు. తమ కేనాడైనా అవకాశం దొరికితే, వాణ్ణి నిలువునా చంపాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. స్థూలకాయుడు తన నౌకర్లను హెచ్చరించి బయలుదేరాడు. ఒక గంటకాలం అడవిలో నడిచిన తరవాత అందరూ, పెద్దపెద్ద గుడారాలున్న ఒక చోటుకు చేరారు.

"వీళ్ళిద్దర్నీ దుంగకు బిగించండి. ఆ తరవాత మీలో యిద్దరు బయలుదేరి వెళ్ళి, ఆ పారిపోయిన ముగ్గురూ ఏమయారో, వాళ్ళ వెంటబడ్డ వాళ్ళేమయారో




తెలుసుకురండి," అన్నాడు స్థూలకాయుడు. కేశవుణ్ణీ, జయమల్లునూ నౌకర్లు ఒక పొడవాటి దుంగకువున్న కంతల్లో కాళ్ళు పెట్టించి, దానికి అటూ యిటూ వున్న రంధ్రాల్లో కొయ్యమేకులు దిగకొట్టారు. వాళ్ళిద్దరి కంతాలకూ ఇనప పట్టెడలు బిగించి, వాటిని కలుపుతూ ఒక గొలుసు కట్టారు. వాళ్ళిద్దరి పక్కనా మరికొందరు యిలాంటివాళ్ళే వున్నారు.

"మనం ఎంత చిక్కులో పడ్డాం! మన బతుకు పశువుల కంటె హీనం అయిపోయిందే, కేశవా!" అన్నాడు జయమల్లు ఎక్కడలేని దిగులుతో.

"అధైర్యపడకు మల్లూ! మనం పారిపోయేందుకు అవకాశం చిక్కకపోదు. నా ఆదుర్దా అల్లా, మా అయ్య ఏమయాడనేదే!" అన్నాడు కేశవుడు.

ఆ పగలంతా గడిచి చీకటిపడే లోపల స్థూలకాయుడు; కేశవుడూ, జయమల్లూ వున్నచోటుకు నాలుగైదుసార్లు వచ్చాడు. వాళ్ళ యోగక్షేమాలను గురించి కన్న తండ్రి కన్న ఎక్కువగా విచారించాడు. తన నౌకర్ల చేత మంచి ఆహారం పెట్టించాడు.

"వీళ్ళిద్దర్నీ మన కన్నబిడ్డల్లాగా చూసుకోవాలి. వీళ్ళు అరుగురు మనుషుల పెట్టు. ఆ చచ్చిన నలుగురి ధరా, వీళ్ళధరా... ఎంతలేదన్నా నూరు బంగారుకాసులు ముట్టితే తప్ప నాక్కలిగిన నష్టం పూడదు. ఇంతకీ, ఆ పారిపోయిన ముగ్గురు దుర్మార్గులూ, వాళ్ళ వెంటబడిన చవటలూ, వాళ్ళందర్నీ వెతకపోయిన ఇద్దరు శుంఠలూ ఏమయినట్టు?" అంటూ స్థూలకాయుడు తన నౌకర్ల మీద విరుచుకుపడ్డాడు.

చీకటిపడిన కొద్ది సేపటికి ఏడుపులూ, మూలుగులతో స్థూలకాయుడి నౌకర్లు పది మంది గుడారాల దగ్గరకు వచ్చారు. వాళ్ళు చావు బతుకులమీదవున్న తమ అనుచరు లిద్దర్ని మోసుకు వచ్చారు.

వాళ్ళు రావటం చూస్తూనే స్థూలకాయుడు పెద్ద కొరడా ఒకటి తీసుకుని, రొప్పుతూ, కేకలుపెడుతూ వాళ్ళను సమీపించి, "ఆ ముగ్గురెక్కడ? ఈ యిద్దరూ ఎందుగ్గాయపడ్డారు? వెళ్ళిన వాళ్ళంతా తిరిగి వచ్చినట్టులేదే!" అంటూ కొరడాతో వాళ్ళను బాదాడు.

ఆ దెబ్బలకు నౌకర్లు లబోదిబోమని, "అయ్యా, ఆ ముగ్గురూ మాలో మరొకణ్ణి చంపి, అరణ్యంలోకి పారిపోయారు. ముఖ్యంగా ఆ ముసలివాడు మనిషికాదు; మనిషిరూపం ఎత్తిన రాక్షసుడు. వాడి కత్తిసామూ...వాడి ధాటీ..." అంటూ పెద్దగా బావురుమన్నారు.

"మీ చచ్చు వెధవలంతా చేరి నన్ను ముంచారు! రెండు జమా, ఆరు ఖర్చు. ఇలా అయితే ఇక వ్యాపారం సాగినట్టే. ఇప్పుడా యిద్దరికీ నూటపాతిక బంగారు కాసులొస్తే తప్ప, అసలు గిట్టుబాటుకాదు," అంటూ స్థూలకాయుడు కొరడా గాలిలో తిప్పుతూ కుప్పిగంతులు వేయసాగాడు.

ఆ రాత్రి కేశవుడికీ, జయమల్లుకూ నిద్ర పట్టలేదు. కొయ్యదుంగలో బిగించి వున్న కాళ్ళు రెండూ చచ్చు పడిపోయినట్టుగా వున్నవి. చుట్టూవున్న అడవిలో పులుల కాండ్రింపూ, సింహగర్జనలూ వాళ్ళకు హడలు పుట్టించినై. తను బానిస వ్యాపారి చేతిలో చిక్కపోయాననే దిగులులో కూడా, కేశవుడికి తన తండ్రి అరణ్యంలో ఎక్కడో సురక్షితంగా వున్నాడనే సంగతి ఆనందం కలిగించింది.

తెల్లవారుతూనే స్థూలకాయుడు ఇద్దరు వ్యక్తుల్ని వెంటపెట్టుకుని కేశవుడూ, జయమల్లూ వున్నచోటుకు వచ్చాడు. అతడి వెంటవున్న వ్యక్తు లిద్దరూ మంచి పట్టు వస్త్రాలు ధరించి, చెవులకు పెద్దపెద్ద పోగులతో, జరీకండువాలతో, గొప్ప వర్తకుల్లా వున్నారు. —(ఇంకా వుంది)





# ప్రభు ధిక్కారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ కార్యదీక్షా, పట్టుదలా చూడగా నీవు నీ కన్న బలవంతుడి అజ్ఞను పాలిస్తున్నావేమోనని నాకు తోస్తున్నది. ఎందుచేతనంటే, తన కన్న బలవంతుడైన వాణ్ణి ధిక్కరించినవాడు కష్టాల పాలవుతాడు. రాజధిక్కారం చేసి యశవర్మ అనే వాడు ఉభయభ్రష్టుడైపోలేదా? శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు యశవర్మ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

యశవర్మ అనే క్షత్రియ యువకుడు కళింగదేశం వాడు. అతను వంగదేశపు చక్రవర్తి వద్ద కొలువులో చేరాడు. వంగదేశంలో గాని, చక్రవర్తి కొలువులోగాని అతని దేశస్థులెవరూలేని కారణం చేత అతను బొత్తిగా

బేతాళ కథలు



ఒంటరిగాడుగా ఉంటూ తన మానాన తాను కాలం వెళ్ళబుచ్చుతూ వచ్చాడు.

ఇలా కొంతకాలం జరిగాక వంగదేశానికీ మగధదేశానికీ మధ్య యుద్ధం వచ్చింది. ఈ యుద్ధంలో వంగయోధులు అద్వితీయ పరాక్రమం కనబరచి మగధసేనలను పూర్తిగా ఓడించేశారు. ఈ విధంగా అద్వితీయ పరాక్రమం ప్రదర్శించినవారిలో యశవర్మ కూడా ఉన్నాడు. అతని సాహస పరాక్రమాలను సాటి యోధులందరూ చెప్పుకుని అతని పట్ల ఎంతో గౌరవం చూపారు.

అయితే చక్రవర్తి మటుకు యోధులందరికీ ఈనాములూ, జాగీర్లూ యిస్తూ యశవర్మకు ఏమీ ఇవ్వనేలేదు. యశవర్మలో సగం పరాక్రమం కూడా చూపనివారు సయితం చక్రవర్తిని బతిమాలో, సేనానాయకుల చేత చెప్పించో గొప్ప బహుమతులు పుచ్చుకున్నారు. యశవర్మ ఎవరినీ ఆశ్రయించ లేదు. తనకు చక్రవర్తి ఎలాటి కానుకా ఇవ్వనందుకు అతను చింతించినట్టు కూడా కనబడలేదు.

చక్రవర్తి ప్రతి పర్వదినంనాడూ, అక్కర జరిగినప్పుడూ కూడా తన ఆశ్రితులకు బహూకృతులు ఇచ్చేవాడు. అలాటి సమయంలో కూడా యశవర్మకు చిల్లి గవ్వ ముట్టలేదు.

ఎంతకాలం గడిచినా యశవర్మ ఆర్థిక పరిస్థితి పెరగలేదు; పైపెచ్చు అతను క్రమంగా బీదవాడు కాసాగాడు. దానికి కారణమేమంటే అతను సహజంగా దాత. ఎవరు దారిద్ర్యంతో బాధపడుతున్నా అతను చూడలేక పోయేవాడు. అడిగిన వారికి లేదని చెప్పి ఎరగడు. ఇలా అందరి దారిద్ర్యాన్నీ పంచుకుని యశవర్మ తానే దరిద్రుడయాడు. అతనికి కొత్తబట్టలు లేవు. ఉన్న ఆయుధాలు కూడా ఒక్కొక్కటే పోయాయి. నౌకర్లు లేకుండా పోయారు. చివరకు తన గుర్రానికి దాణా కొనిపెట్టలేని

దుస్థితికి వచ్చేశాడు యశవర్మ. ఆ గుర్రాన్ని మేపటానికిగాను అతను వీలు చిక్కినప్పుడల్లా వాహ్యాళి నెపం మీద నదీ తీరానికి వెళ్ళి, ఏ చెట్టు కిందనో విశ్రాంతి తీసుకుని, అక్కడి గడ్డిని మేయటానికి గుర్రాన్ని వదిలేవాడు.

ఒకనాటి సాయంకాలం యశవర్మ నదీ తీరాన ఒక చెట్టు కింద పడుకుని విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఎవరో ఇద్దరు స్త్రీలు అతనున్న చోటికి వచ్చి, "మా దేవి తమరితో మాట్లాడాలంటున్నది. ఒక్కసారి ఆ కనిపించే పొదరింటి కేసి వస్తారా?" అని అడిగారు.

యశవర్మ వారిని చూసి ఆశ్చర్యపడ్డాడు. ఎందుకంటే వారు మానవ స్త్రీలలాగా లేరు. "తప్పక వస్తాను," అంటూ అతను వారి వెంట బయలుదేరాడు.

పొదరింటిలో మరొక స్త్రీ ఉన్నది. అంత సౌందర్యవతిని యశవర్మ ఎన్నడూ ఊహించను కూడా లేదు.

ఆమె అతన్ని తన పక్కనే కూచోమని, "యశవర్మా, నే నొక గంధర్వ స్త్రీని. నీ వంటి ఉత్తమ మానవులను ప్రేమించటం మాకు పరిపాటే. నీకు సమ్మతమైన పక్షంలో నేను నీకు భార్యగా ఉండగోరుతున్నాను," అన్నది.





"దేవీ, నీవు వీధి బిచ్చగత్తెవయినా నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించ గలను," అన్నాడు యశవర్మ.

తరవాత ఆ గంధర్వ స్త్రీ తన చెలికత్తెల చేత దివ్యమైన భోజనం తెప్పించింది. వారిద్దరూ భోజనం చేసేశారు. యశవర్మ దేవభోగాలన్నీ అనుభవించాడు.

యశవర్మతో ఆ గంధర్వాంగన, "పొద్దు పోతున్నది. ఇక నీవు వెళ్ళిరా. ఈ సంచీ తీసుకో. ఇందులో నుంచి నీకు ఎంత తీసినా బంగారం వస్తుంది. ఇది ఉన్నంత కాలమూ నీకు దారిద్ర్యం ఉండదు. నీకు నన్ను చూడాలనిపించినప్పుడల్లా ఇక్కడికి వచ్చి నన్ను పిలిస్తే నేను క్షణంలో వస్తాను. కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో: నన్ను గురించి పొరపాటున కూడా ఎవరితోనూ చెప్పవద్దు. అలా చెప్పావో, నేను నీకు మరి దక్కను. ఈ మాట మరవవద్దు," అన్నది.

అది మొదలు యశవర్మ జీవితమంతా మారిపోయింది. అతని ఇల్లు పెద్ద హర్మ్యమయిపోయింది. అతని గుర్రపు జీను బంగారుది. అతని దుస్తులు జరీ దుస్తులు. అతని దాన ధర్మాలకు అంతులేదు. ఒకప్పుడు ఇతరుల దారిద్ర్యాన్ని తాను పంచుకున్నట్టే ఇప్పుడతను తనకుగల అంతులేని బంగారాన్ని అందరికీ పంచాడు. సాటియోధులు అతని దశ మారినందుకు చాలా సంతోషించారు.

తీరిక కలిగినప్పుడల్లా అతను నదీ తీరానికి వెళ్ళి తన భార్యను పిలిచేవాడు. ఆమె వెంటనే వచ్చేది. అతను ఆమెతో కొంతకాలం సుఖంగా గడిపి తిరిగి నగరుకు వచ్చేసేవాడు.

ఇలా ఒక ఏడాది గడిచింది. సంవత్సరాది వచ్చింది. ఆ నాడు తన కొలువులో ఉండే వారి నందరినీ తన భవనానికి పిలిచి విందు చేయటం చక్రవర్తికి

అలవాటు. ఆ విందు చాలా ఉత్సాహ భరితంగా జరిగేది.

విందు మధ్యను చక్రవర్తి అకస్మాత్తుగా తన అనుచరులతో, "మహారాణిని మించిన సౌందర్యవతి ప్రపంచంలో ఎక్కడా లేదని నేను ఘంటాపథంగా చెప్పగలను. ఆమెను ఇప్పుడే పిలిపిస్తాను. మీలో ఎవరైనా అంత కంటె అందగత్తెను చూసి ఉన్నట్టయితే రుజువు చేయవచ్చు," అన్నాడు.

నౌకర్లు చక్రవర్తి భార్య వద్దకు వెళ్ళి, చక్రవర్తి ఆమె సౌందర్యాన్ని గురించి అన్న మాటలు చెప్పి, ఆమెను విందు జరిగే చోటికి తీసుకువచ్చారు.

మహారాణి తాను గొప్ప సౌందర్యవతి నన్న గర్వాతిశయంతో విర్రవీగిపోతూ చక్ర వర్తి సమీపంలో నిలబడింది.

"మహారాణిని సరిగా చూడండి. ఇంతకు మించిన సౌందర్యవతిని ఎవరైనా ఎన్నడైనా చూశారా?" అన్నాడు చక్రవర్తి.

ఆమె సౌందర్యవతి అన్నమాట నిజమే గాని ఆమె కన్న సౌందర్యవతులు రాజుగారి అనుచరుల భార్యలలోనే ఒకరిద్దరున్నారు. అయినా అందరూ ఆమె కేసి తేరిపార జూచి తలలు ఆడించి, "నిజం! నిజం!" అన్నారు. ఒక్క యశవర్మ మాత్రం ఆమె



కేసి చూడనైనా చూడకపోగా, తలవంచు కుని తనలోతాను నవ్వుకున్నాడు.

అందరినీ శ్రద్ధగా గమనిస్తున్న మహారాణి చక్రవర్తితో, "ఈ యశవర్మ నా అందాన్ని పరిహసించి నన్ను అవమానించాడు. దీనికి తగిన ప్రతీకారం చెయ్యండి," అన్నది.

ఈ మాటలు విని చక్రవర్తి తోక తొక్కిన తాచులాగా అయి, "ఏం, యశవర్మా? అందరూ మహారాణి సౌందర్యాన్ని శ్లాఘిస్తూ ఉంటే నీ వొక్కడవే మౌనంగా ఉండటాని కేమిటి కారణం?" అని అడిగాడు.

యశవర్మ ధైర్యంగా లేచి నిలబడి, "మహారాజా, తమరు మహారాణిగారిని

ఇంతమందిమధ్యకు పిలిపించి, అందరి చేతా ఇచ్చకాల మెప్పు మాటలు పలికించి వారికి ఇలా అన్యాయం చేయటం ఉచితం కాదు. మహారాణిగారి సౌందర్యం గురించి సందేహం ఏమీలేదు, కాని అంతకంటె సౌందర్యవతులు ప్రపంచంలో ఎందరో ఉన్నారు," అన్నాడు.

"ఒక్క సౌందర్యవతిని ఉదాహరణగా చెప్పు," అన్నాడు చక్రవర్తి.

"ఎంతో దూరం పోనవసరం లేదు, మహారాజా. నా భార్య మహారాణివారిని సౌందర్యంలో సులువుగా మించుతుంది," అన్నాడు యశవర్మ.

ఈ మాట విని అందరూ విస్మయం చెందారు. అతని కొక భార్య ఉన్నట్టు కూడా ఎవరికీ తెలియదు.

"అలా అయితే అతని భార్యను సభకు రప్పించ మనండి. ఆమె అందమే ఎక్కువో, నా అందమే ఎక్కువో వీరందరూ నిర్ణయిస్తారు!" అన్నది మహారాణి పట్టరాని ఆగ్రహం కనబరుస్తూ. చక్రవర్తికి ఈ ఆలోచన నచ్చింది.

"అవును, అలాగే చెయ్యి. నీ భార్యను తీసుకు రా. నలుగురూ ఆమె అందమే ఎక్కువని నిశ్చయించిన పక్షాన నీ ధూర్తత్వాన్ని క్షమిస్తాము. లేనిపక్షాన, మహారాణిని



అవమానించి నందుకు నిన్ను క్రూరంగా శిక్షిస్తాము," అన్నాడాయన.

యశవర్మ వెంటనే గుర్రమెక్కి నదీ తీరానికి వెళ్ళి, మామూలు ప్రకారం తన భార్యను పిలిచాడు. కాని అతను ఎన్ని సార్లు పిలిచినా ఆమె రానేలేదు. తాను ఆమె పెట్టిన నియమం అతిక్రమించి, ఆమె విషయం ఇతరులకు చెప్పేశాడు. అలా చేసినట్టయితే తమ దాంపత్యం అంతమై పోతుందని ఆమె ముందే చెప్పింది. ఇక ఆమె యశవర్మకు మరి కనబడదు.

చక్రవర్తి తనను దండిస్తాడని కూడా ఆలోచించకుండా, యశవర్మ తన భార్యను పోగొట్టుకున్నందుకు హతాశుడై, విచారంతో తిరిగివచ్చాడు.

అతన్నీ, అతని వాలకాన్నీ చూస్తూనే చక్రవర్తి, "నీ భార్య ఎక్కడ?" అని అడిగాడు.

"మహారాజా, ఆమెను తీసుకు రావటానికి నాకు శక్తిలేదు," అన్నాడు యశవర్మ నిర్భయంగా.

చక్రవర్తి తన భటులను పిలిపించి, "నన్ను ధిక్కరించి, మహారాణిని అవమానించిన ఈ అధముణ్ణి చీకటికొట్టులో బంధించండి," అన్నాడు. భటులు అలాగే చేశారు. యశవర్మ చీకటికొట్టులో నిర్బం



ధితుడైకూడా తాను పోగొట్టుకున్న భార్య కోసం కుమిలి, కృశించి, కొంతకాలానికి ప్రాణాలు విడిచాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. యశవర్మ ఇటు చక్రవర్తి ఆగ్రహానికీ, అటు గంధర్వ స్త్రీ ఆగ్రహానికీ కూడా గురి అయే పని ఎందుకు చేశాడు? అందరిలాగా అతను కూడా రాణీని మెచ్చుకుంటే సరిపోయేది గద? అలా చెయ్యక పోవటానికి రాజుగారి పట్ల తేలిక భావమా? లేక తనకు ఒక గంధర్వ స్త్రీ భార్యగా ఉన్నదనీ, కోరినంత బంగారం ఉన్నదనీ అతిశయమా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "యశవర్మ చక్రవర్తిపై తృణీకార భావం కలవాడైతే గంధర్వ స్త్రీతో పరిచయం అయినాక చక్రవర్తి కొలువుమాని ఉండేవాడు. తనకు అపూర్వమైన భార్య ఉన్నదనీ, అంతులేని బంగారం ఉన్నదనీ అతిశయం పొందిన వాడైతే వాటిని పోగొట్టుకునే పని చేసేవాడు కాడు. అతను ఇతరులలాగా మహారాణిని ఎందుకు మెచ్చుకోలేదంటే అతనిలో కపట స్వభావం లేదు. మెచ్చుకున్నవారంతా మహారాణిని అవమానిస్తున్నారని అతను ఒకడే గ్రహించి ఆ పని తాను కూడా చేయలేకపోయాడు. అతను స్వార్థం ఎరగనివాడు కావటం చేతనే చక్రవర్తి తనకు ఎన్నడూ ఏ విధమైన కానుకా ఇవ్వకపోయినా అతను చింతించ లేదు. స్వార్థం ఎరగని వాడు కావటం చేతనే అతను తన భార్య సంగతి చెప్పేటప్పుడు తనకు కలగబోయే నష్టాన్ని గురించి ఏమాత్రం ఆలోచించలేక పోయాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# గుణపాఠం

ఒక గ్రామంలో యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. ఆయన అనేక శాస్త్రాలు తెలిసినవాడూ, చాలా మంచివాడూనూ. ఆయన చాలా ఇళ్ళలో పౌరోహిత్యం కూడా చేసేవాడు. అందరూ ఆయనను యెంతో గౌరవంతో చూసేవారు. యజ్ఞశర్మకు భార్యా, పిల్లలూ లేని కారణం చేత తాను సంపాదించినదంతా దానధర్మాల కింద ఖర్చు చేస్తూ వుండేవాడు.

యజ్ఞశర్మ ఇంటి కెదురుగా వ్యాపారి ఒక డుండేవాడు. అతని పేరు నరసింహం. ఇద్దరూ చిన్ననాటి నుంచీ స్నేహితులే అయినా వారి బుద్ధులలోనూ, ప్రవర్తనలోనూ పోలిక యేమీలేదు. నరసింహం ఇతరుల కుండేది చూసి సహించలేక పోయేవాడు, తన స్వార్థం కోసం యేమైనా చేసేవాడు. తన మిత్రుడిలో వుండే ఈ దుర్బుద్ధిని మార్చాలని యజ్ఞశర్మ యెంతో ఆలోచించాడు. కాని అందుకు తగిన అవకాశం దొరకలేదు. ఇలా వుండగా ఆ గ్రామంలో ఒక సంపన్నుడికి లేక లేక మగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడి నామకరణ మహోత్సవం ఎంతో వైభవంగా జరిగింది. ఆ నాడు పౌరోహిత్యం చేసిన యజ్ఞశర్మకు సంపన్నుడు పట్టు బట్టలు పెట్టటమేగాక, ఒక ఖరీదైన వజ్రపు టుంగరాన్నికూడా యిచ్చాడు.

తనకు కానుకగా వచ్చిన ఆ వజ్రపు టుంగరాన్ని యజ్ఞశర్మ ఊరందరికీ చూపాడు. అందరూ సంతోషించారు గాని నరసింహం మాత్రం కళ్ళలో నిప్పులు పోసుకున్నాడు. అతని మనసు అసూయతో దహించుకు పోయింది. పౌరోహిత్యం చేసుకునేవాడికి అంత మంచి ఉంగరమా అన్న దిగులూ, డబ్బు సంపాదించుకునే తన వద్ద ఏనాడూ అటువంటి వస్తువు లేకపోయెనే అన్న బాధా నరసింహాన్ని పీడించాయి.

“శ్రీ సారధి”

నరసింహం పైకి ఏమీ అనకపోయినా అతని కడుపులోని ఆలోచనలను యజ్ఞశర్మ సూక్ష్మబుద్ధి కావటంచేత, పసి కట్టేశాడు. నరసింహం చూస్తుండగానే అతను తన వేలి నున్న ఉంగరం తీసి ఒక బరిణెలో వుంచి, ఆ బరిణెను గూట్లోపెట్టాడు. నరసింహం లోలోపల సంతోషించి, ఇంటికి వెళ్లాడు.

అర్థరాత్రివేళ నరసింహం యజ్ఞశర్మ ఇంటికి దొంగతనానికి వచ్చాడు. లోపలికి ఎలా ప్రవేశించటమా అని తలుపులు తడువు తుండగా అవి కాస్తా తెరుచుకున్నాయి. ఇక తన పంట పండినట్టే అనుకుని నరసింహం ఆలకించాడు. యజ్ఞశర్మ గుర్రుపెట్టి నిద్ర పోతూ వుండటం తెలియ వచ్చింది. నర సింహం అడుగులో అడుగు వేసుకుంటూ గూటి వద్దకు వెళ్ళాడు. బరిణె తీసుకుని దాని మూత తీశాడు. వెంటనే ఎర్రతేలు ఒకటి అతణ్ణి అంట పొడిచింది. "బాబో! తేలు!" అని నరసింహం కేకపెట్టాడు.

నిద్రపోతున్నట్టు నటిస్తున్న యజ్ఞశర్మ లేచి కూచుని, "ఎవరు వారు? ఏమిటది?" అని అడిగాడు. దొంగ దొరికిపోయాడు.

"నువేనా, నరసింహం? ఈ రాత్రివేళ ఎందుకు వచ్చావు? నన్ను లేపకపోయావా? నీకు తేలు యెక్కడ కుట్టింది? ఆ బరిణె యెందుకు తీశావు? పడుకోబోయేముందు తేలొకటి ఇంట్లోకి వస్తే, తెల్లవారి నాక దూరంగా విడిచిపెడదాంగదా అని ఆ బరి ణెలో వుంచాను," అన్నాడు యజ్ఞశర్మ.

నరసింహం తాను దొంగతనానికి వచ్చా ననీ, వజ్రపు టుంగరం చూసినది మొదలు నిద్రాహారాలు లేవనీ ఒప్పేసుకున్నాడు.

"పిచ్చివాడా, నేను పరాయివాణ్ణేమీ కాదుగదా! ఉంగరం కావాలంటే నన్ను అడిగెయ్యలేక పోయావా? ఇచ్చివుందునే!" అన్నాడు యజ్ఞశర్మ. నరసింహం ప్రాణం ఈ మాటలతో మరింత చచ్చినట్టయింది. ఆ గుణ పాఠంతో అతను పూర్తిగా మారిపోయాడు.





# పెళ్ళిగండం

ఎంతో శ్రమపడి కుదిర్చిన సంబంధం కాస్తా తప్పిపోయినందుకు పాపన్న తల్లి చాలా విచారించింది. ఆమెకు కొడుకు మీద కోపం కూడా వచ్చింది. "నీ కెప్పుడూ ఇతరుల చింతే తప్ప నీ చింత లేకపోయె! అందుకే నీ కెవరూ పిల్ల నివ్వరు. అఖరుకు డబ్బుపోసి పిల్లను కొనుక్కుందామనుకుంటే, ఆ పిల్ల ఇంకెవరినో ప్రేమించిందని పరోపకారం పేరుతో డబ్బునూ, పిల్లనుకూడా పోగొట్టుకుంటివి. ఎలారా నీతో?" అన్నదామె.

"అమ్మా, పరోపకారం కన్న పెళ్ళి ఎక్కువా? ఒక్కనాటికికాదు. పరోపకారార్థమిదం శరీరం అని మా గురువుగారు రోజూ అనేవారు. కాకపోయినా, కొనుక్కు తెచ్చుకున్న పెళ్ళాంతో ఏం సుఖపడతాను? నాకు తగినదాన్ని నేను ఏదోవిధంగా పెళ్లాడతాను. నీవు విచారపడకు," అని తల్లికి చెప్పి పరోపకారి పాపన్న దేశాటనకు బయలుదేరాడు. ఒక్కొక్క గ్రామమే తిరిగి తనకు తగిన కన్య ఎక్కడ దొరికితే అక్కడే పెళ్లాడెయ్యాలని పాపన్న ఉద్దేశం.

రోజల్లా ప్రయాణంచేసి పొద్దువాలే సమయానికి పాపన్న ఒక గ్రామం చేరాడు. అక్కడ ఆనాడు సంత జరిగింది. సంతలో సరుకు కొని పెద్దమూట కట్టుకుని, మోయలేక మోస్తూ ఇంటికి పోతున్న ఒక ముసలాయన పాపన్నకు తటస్థపడ్డాడు.

"ఆ మూట ఇలా ఇవ్వండి. మీ ఇంటి దాకా పట్టుకొచ్చిపెడతాను," అని పాపన్న ముసలాయనతో అన్నాడు. అది చాలా బరువు ఉండటం చేత ముసలాయన సంతోషంగా పాపన్నను మోయనిచ్చాడు. ఇద్దరూ ముసలాయన ఇంటికి చేరేసరికి పొద్దు వాలి పోయింది. "ఇక నేను వెళ్ళివస్తాను, సెలవిప్పించండి. పై గ్రామం ఎంతదూరంలో ఉందో ఏమిటో," అన్నాడు పాపన్న.



"తొందరపని ఏమీ లేకపోతే ఈ పూటకు మా ఇంట ఉండి తెల్లవారిన తరవాత వెళ్ళ వచ్చునే. చాలా పొద్దుపోయింది," అన్నాడు ముసలాయన.

పాపన్న ఇందుకు సమ్మతించి, ఆ రాత్రి అక్కడే భోజనం చేసి, బయటి అరుగుపైన పడుకుని వెంటనే నిద్రపోయాడు.

ఈ ముసలాయన ఇంట ఒక విధవ కోడలూ, పెళ్ళిగాని మనమరాలూ ఉన్నారు. మనమరాలు పదహారేళ్ళది. పేరు మీనాక్షి. ఆ పిల్లకు పెళ్ళి కాకపోవటానికి కారణం ఉన్నది. ఆమె జాతకం చూసిన జ్యోతిష్కులు ఆమెకు వితంతువయే యోగం ఉన్నదనీ, ఆమెను పెళ్ళి చేసుకున్నవాడు తప్పక చనిపోతాడనీ చెప్పారు. ఈ సంగతి చుట్టుపక్కల ఊళ్ళకుకూడా తెలిసిపోయింది. అందుచేత, మీనాక్షి అందమైన పిల్లే అయినప్పటికీ, ఆమెను చేసుకోవటానికి ఎవరూ సాహసించలేదు. అదీగాక, ముసలాయనకుకూడా జాతకాలలో పూర్తి నమ్మకం ఉండటంచేత, ఆ పిల్ల కోసం ఎక్కడా సంబంధాలు వెతకలేదు. పిల్ల పెళ్ళి భారమంతా దైవం మీద వేసేసి ఆయన చేతులు కట్టుకు కూచున్నాడు.

ఇలాటి పరిస్థితిలో గోరుచుట్టుపై రోకటి పోటన్నట్టుగా రాజుగారు ఒక శాసనం చేశారు—పదహారేళ్ళు నిండి పెళ్లికాకుండా కన్యలను ఉంచరాదు; అలాటి కన్య ఎక్కడైనా ఉంటే గ్రామాధికార్లు వారిని తమకిష్టమైన ఎవరికో ఒకరికిచ్చి బలాత్కారంగా పెళ్ళి చేసెయ్యవచ్చు.

సరిగా ఈ రోజునే మీనాక్షికి పదహారేళ్ళు నిండాయి. రేపు గ్రామాధికారి వచ్చేసరికి ఆమెకు పెళ్ళి అయి ఉండకపోతే ఆమెను దారేపోయే ఏ దానయ్యకో ఇచ్చి ముడిపెట్టేస్తారు. కాటికి కాళ్ళుచాచుకుని కూచున్న ఏ ముసలాడైనా ఆమెను పెళ్ళాడటానికి సాహసించవచ్చు.

అరుగు మీద పాపన్న నిశ్చింతగా నిద్ర పోతుంటే ఇంట్లో ఉండే ముగ్గురూ ఈ విషమ సమస్య గురించి తలకాయలు పగలగొట్టు కుని చాలాసేపు నిద్రపోలేదు. తల్లి కూతుళ్లు కంటికీమంటికీ ఏకధారగా ఏడ్చారు. ముస లాయన వారిని సముదాయించలేక తాను కూడా కంట తడి పెట్టుకున్నాడు.

చాలా పొద్దుపోయి వాళ్ళు పడుకున్నాక మీనాక్షి మెల్లిగా లేచి బయటికి వెళ్ళింది. బావిలో పడి ఆత్మహత్య చేసుకుంటే పీడ విరగడ అయిపోతుందని ఆమె అనుకున్నది. మీనాక్షి లేచి వెళ్ళటం తల్లి గమనించి వెన కడితే వెళ్ళి, బావిలో పడబోతున్న కూతుర్ని పట్టుకుని, "తోడులేకుండా ఒక్క_త్తె వే బావిలో ఎందుకు పడతావు తల్లీ? పడితే ఇద్దరమూ పడదాం!" అని గొల్లుమన్నది.

వీళ్ళిద్దరూ ఏడుస్తూ మాట్లాడే మాటలకు పాపన్న కాస్తా లేచి కూచున్నాడు. బావి దగ్గిర ఇద్దరాడవాళ్ళనూ చూశాడు. వాళ్లు బావిలో దూకటానికి పోటీలు పడటం విన్నాడు. గబ గబా అతను వాళ్ళ దగ్గిరికి వెళ్లి, "బావిలోకి దిగాలంటే నేను దిగుతాను, మీవల్ల ఏమవు తుంది? ఇంతకూ బావిలో ఏమన్నా పడి పోయిందా ఏమిటి?" అని అడిగాడు.

ఈ సరికి ముసలాయన కూడా లేచి బయ టికి వచ్చాడు. అయన పాపన్నతో తమకు



వచ్చిపడిన సమస్య గురించి వివరంగా చెప్పి, "నాయనా, మాకు వచ్చిపడిన కష్టం ఒకరు అర్చేదీ, తీర్చేదీకాదు," అన్నాడు.

"ఇందులో కష్టం ఏముందండీ? కావలిస్తే నేను మరొకపూట మీ ఇంటనే ఉంటాను. రేపు గ్రామాధికారి రాగానే పిల్లకు పెళ్ళి అయిందని చెప్పండి. పిల్ల మొగుడెక్కడని అడిగితే నన్ను చూపండి. ఆ తరవాత రాజుగారి శాసనం బెడద తప్పుతుంది, నా దారిన నేను వెళ్ళిపోతాను," అన్నాడు పాపన్న.

"పెళ్ళి అయిపోయిందని అబద్ధమాడితే గ్రామాధికారి నమ్ముతాడా, నాయనా?, పురోహితుడి సాక్ష్యం కావాలి, నలుగురూ పెళ్ళి జరిగిందని అనాలి," అన్నాడు ముసలాయన.

పాపన్న కొంచెం ఆలోచించి, "అలా అయితే పెళ్ళితంతు జరిపించండి. నేనసలు గ్రామాల వెంట బయలుదేరిందే పెళ్లి కోసం. నా పనీ, మీ పనీ కూడా ఒనగూడినట్టవుతుంది," అన్నాడు.

"పిల్ల జాతకంలో దోషంవుంది, నాయనా. దాన్ని చేసుకున్నవాడు వెంటనే చనిపోతాడని మా ఊరి జ్యోతిష్కుడు బల్లగుద్ది చెప్పాడు," అన్నాడు ముసలాయన.

మీనాక్షికూడా, "వద్దు, వద్దు! నన్ను చేసుకుంటే అయన చచ్చిపోతారు," అన్నది.



"పరోపకారం చేసే అవకాశమే దొరకాలి గాని నేను చావటానికి భయపడేవాణ్ణి కాను. పరోపకారం కోసం ప్రాణా లర్పించినవాడు మరింత పుణ్యం సంపాదించుకుంటాడని మా గురువుగారు ఒకటికి రెండుసార్లు చెప్పేవారు," అన్నాడు పాపన్న.

గండం సంగతి తెలిసికూడా చేసుకుంటానని పాపన్న అంటున్నాడు గనక ముసలాయన క్షణంలో పురోహితుణ్ణీ, గ్రామాధికారినీ, ఇరుగుపొరుగు వాళ్ళనూ పోగుచేసి, పాపన్నచేత మీనాక్షి మెడలో తాళికట్టించాడు.

ఈ పురోహితుడే మీనాక్షి జాతకం చూసిన జ్యోతిష్కుడు. పెళ్ళయిన కొద్దిసేపటిలో పాపన్న చావకపోతే ఊళ్ళో తన మాటకు చిల్లిగవ్వ విలువ ఉండదనుకుని ఆ పురోహితుడు నీళ్లలో ఏదో మందుకలిపి పాపన్న చేత తాగించాడు. అది తాగిన కొద్దిసేపటికే పాపన్న స్పృహతప్పి పడిపోయాడు.

పెళ్లికి వచ్చిన ఆడవాళ్ళు గొల్లుమన్నారు. గ్రామాధికారీ తక్కిన పెళ్ళిపెద్దలూ కంగారు పడిపోయారు.

"నాకు మొదటనే తెలుసు. విధిని ఎవరు తప్పించగలరు? నిక్షేపంలాటి కుర్రవాడు. ఏ ఊరువాడో ఏమో! పాపం, నిష్కారణంగా ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు," అన్నాడు పురోహితుడు.



పాపన్న నిజంగా చచ్చాడో లేదో చూడాలని ఎవరూ ప్రయత్నించలేదు. జ్యోతిషంలో వారికిగల నమ్మకం అటువంటిది!

పాపన్నను శ్మశానానికి తీసుకుపోవటానికి ఏర్పాట్లన్నీ జరిగాయి. అతనికి స్నానంకూడా చేయించారు. ఆ సమయంలో పాపన్న ఒక్క దగ్గుదగ్గి వాంతి చేసుకుని, కళ్ళుతెరిచి లేచి కూచుని, "ఏమిటి? ఏం జరిగింది?" అన్నాడు. అతని శరీరం దృఢమైనది. పురోహితు డిచ్చిన మందు అతనిపైన ఎక్కువ సేపు పనిచెయ్యలేదు.

కాని పురోహితుడు తన పీక మీదికి వచ్చిందని తెలుసుకుని మాట ఫిరాయించేసి అక్కడ ఉన్నవారితో, "అసలేం జరిగిందో చెబుతాను వినండి. ఈ అబ్బాయి మొహం చూస్తూనే దీర్ఘాయువని పసికట్టేశాను. కాని అమ్మాయి జాతకంలో ఉండే పీడ పోవటానికిగాను అపాయంలేని మందు ఒకటి నీటిలో కలిపి అబ్బాయి చేత తాగించాను. ఈ సంగతి ముందుగా మీకెందుకు చెప్పలేదంటారేమో! అతను నిజంగా చనిపోయినాడనుకుని మీరంతా ఒక శోకం పెడితే తప్ప దుష్టగ్రహ వీక్షణ దోషం సమసిపోదు. అబ్బాయి ఎప్పుడు లేస్తాడా అని ఇంధాకటి నుంచీ చూస్తూనే ఉన్నాను. లేవనే లేచాడు. ఇక ఇతని ఆయుర్దాయానికి ఎలాటి ప్రమాదమూలేదు," అన్నాడు.

ఈ మాటలు అందరూ నమ్మారు. పాపన్న తన భార్యతో అత్తవారింట మూడు నిద్రలు చేసి ఆమెతో సహా ఇంటికి తిరిగి వచ్చాడు. ఒక్క కానీ ఖర్చులేకుండా పాపన్న చక్కని చుక్కను భార్యగా తెచ్చుకున్నందుకు అతని తల్లి సంతోషించింది.

తనకు ఆపదలో అడ్డుపడటం కోసం తన ప్రాణాన్నికూడా ఇవ్వటానికి సిద్ధపడ్డాడని మీనాక్షి పాపన్నను దేవుడి కంటె ఎక్కువగా చూసుకుంటూ అతనితో సుఖంగా కాపరం చేసింది. [సమాప్తం]





# రాజైన బానిసపిల్ల

ఖురాసాన్ దేశంలో ఒక కోటీశ్వరుడైన వర్తకుడికి అలీషార్ అనే నవమన్మథుడు లాటి కొడుకు ఉండేవాడు. ఆ వర్తకుడు జబ్బుపడి, తన కాలం సమీపించిందని తెలుసుకున్నవాడై, అలీషార్‌ను పిలిచి, "నాయనా, నేను కన్నుమూసే ముందు నీకు కొన్ని హితవాక్యాలు చెప్పాలను కున్నాను. ప్రపంచం భయంకరమైన కొలిమిలాటిది; దానితో అతిగా సంపర్కం పెట్టుకోకు; అందువల్ల చాలా బాధలు పడ తావు. నీకు శక్తి ఉన్నప్పుడు పరులకు ఉపకారం చెయ్యి కాని దానికి ప్రతిఫలం అపేక్షించకు. మరొకమాట కూడా జ్ఞాపకం ఉంచుకో: ఇతరులకు నిజంగా మేలుచేసే అవకాశాలు ఎప్పుడో తప్పరావు. నీ కున్న ధనాన్ని దుర్వ్యయం చెయ్యకు; నిన్ను లోకం నీ డబ్బుతోనే తూస్తుంది. ఇంకొక్క సంగతి: తాగుడు చాలా హేయమైనది; అది మనిషియొక్క పరువు మట్టిపాలుచేసి, మనిషిని నవ్వులపాలు చేస్తుంది," అని చెప్పాడు.

అలీషార్ ఎంతో భక్తితో, తాను చెప్పిన హితవాక్యాలను పాటిస్తానని మాట ఇచ్చి ప్రమాణం చేసినాక, ఆ ముసలివాడు నిశ్చింతగా కన్ను మూశాడు.

తండ్రి పోయాక అలీషార్ ఒక సంవత్సరం పాటు తూచా తప్పకుండా తండ్రి హితవచనాలు పాటిస్తూ వర్తకం సాగించి ఆ తరవాత క్రమంగా దుష్టసహవాసాలకు గురి కాసాగాడు. నీచులూ, పనికిమాలిన వాళ్ళూ, లేకివాళ్ళూ అయిన కుర్రవాళ్ళు అతని స్నేహం సంపాదించి, అతన్ని దుష్ట మార్గాన నడిపించారు. ఆ మార్గాన కాలు పెట్టిన అలీషార్, తన వ్యాపారమూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, తన సర్వస్వమూ గుల్ల అయిపోయిన దాకా కన్ను తెరవలేదు. తీరా అతను ఆ మైకంలో నుంచి బయటపడేసరికి

సి. మాధవరావు



అతనికి తన ఒంటిమీది ఉడుపులు తప్పించి చిల్లిగవ్వ కూడా మిగలలేదు.

కలిగిననాటి స్నేహితులంతా ముఖం తప్పించినాక అతనికి తన తండ్రి చెప్పిన హితవాక్యాలలోని వాస్తవం మరింత బాగా తెలిసి వచ్చింది. ఉండటానికి ఇల్లు కూడా లేదు. అలీషార్ ఒక పేదకొంపలో ఉంటూ తిండి కోసం ఆ గడపవద్దా ఆ గడపవద్దా అడుక్కోవలిసిన స్థితికి దిగజారిపోయాడు.

ఇలా చిప్ప పుచ్చుకుని అడుక్కుంటూ అతను సంత పక్కగా వెళుతూ ఉండగా అక్కడి పెద్ద గుంపు కనబడింది. అక్కడి వింత ఏమిటో చూదామని అతను దగ్గిరికి వెళ్ళాడు. ఆ గుంపు మధ్య ఒక అందాల రాశి అయిన బానిసపిల్లను వేలం వేస్తున్నారు. ఆ పిల్ల అందాన్ని చూసి అలీషార్ నిశ్చేష్టుడై, తన దుస్థితిని మరచి, తనను తానే మరిచి, ప్రతిమలాగా నిలబడిపోయాడు.

బానిసను వేలం వేస్తున్నవాడు గొంతెత్తి, "అయ్యలారా! వ్యాపారులారా! ధనికులారా! ఎడారి వర్తకులారా! దయచెయ్యండి. ఈ కన్యను చూడండి, జముర్రుద్! చంద్రుణ్ణి ధిక్కరించే సౌందర్యవతి! ఈమె కేమిస్తారు? ఒక మాట అనండి! తప్పులేదు," అని ఆహ్వానించాడు.

ఎవరో అయిదువందల దీనారాలన్నారు. రషీద్ అల్దీన్ అనే ముసలి పీనుగొకడు ఆరువందలన్నాడు. ఇతరులు పాట పెంచారు. ముసలి పీనుగు వెయ్యి దీనారాలన్నాడు. ఆ తరవాత ఎవరూ ఉలకలేదు. అప్పుడు వేలం పాటగాడు బానిస సొంతదారుకేసి తిరిగి, "వెయ్యికి పాట కొట్టెయ్యమన్నారా?" అని అడిగాడు.

దానికి బానిస సొంతదారు, "నా కేమీ అభ్యంతరం లేదుగాని, ఎవరెంత పాడినా ఆమెకు ఇష్టం లేని వాడికి అమ్మనని ప్రమాణం చేశాను. అందుచేత నీవు పొందవలిసింది ఆమె అనుమతి," అన్నాడు.

అప్పుడు పాటగాడు బానిస పిల్ల కేసి తిరిగి, "అందాల రాణీ, ఈ యోగ్యుడైన ముసలి రషీద్ అల్దీన్‌కు అమ్ముడు పోతావా?" అని అడిగాడు. జముర్రుద్ ఒప్పుకోనన్నది.

అదే ధరకు ఆమెను మరెవరైనా కొన టానికి సిద్ధంగా ఉన్నారా అని పాటగాడు అడిగితే ఇద్దరు ముగ్గురు సిద్ధపడ్డారు. ఒకడు రషీ దంత ముసలివాడు కాడు కాని తన ముసలితనం తెలియరాకుండా జుట్టుకు ఎర్ర రంగు వేశాడు. మరొకడికి ఒక కన్ను లేదు. ఇంకొకడికి పొడవాటి గడ్డం బొడ్డు దాకా వేళాడుతున్నది.

జముర్రుద్ అందరినీ వేళాకోళం చేసి ఎవరికీ అమ్ముడు పోనన్నది.

"సరే అయితే ఇక్కడ ఉండే వారి సందరినీ చూసి, ఎవరికి అమ్ముడవుతావో నీవే ఎంచుకో!" అన్నాడు పాటగాడు.

ఆమె ఒక్కొక్క ముఖమే పరీక్షిస్తూ అలీషార్‌ను చూడగానే అతని అందానికి ఆ క్షణంలోనే బానిస అయిపోయింది. ఆమె అతన్ని పాటగాడికి వేలు పెట్టి చూపించి, "అతనికి అమ్ముడవుతాను," అంటూ మగవాడి అందం మీద ఎవరెవరో రాసిన పద్యాలు బోలెడు చదివింది. పాటగాడు నిర్ఘాంతపోయి ఆమె యజమానితో,





"ఈ పిల్ల, ఏమో అనుకున్నాను, అఖండు రాలేనే!" అన్నాడు.

"ఇంతకే ఆశ్చర్యంగా ఉందా? దానికి రాని విద్య లేదు. అల్లిక పని అద్భుతంగా చేస్తుంది. యాభయ్యేసి దీనారాల ఖరీదు చేసే పరదాలూ, తివాసీలూ వారం రోజు లలో అల్లుతుంది. ఆమె కిచ్చే ఖరీదు త్వరలోనే రాబట్టుకోవచ్చు," అన్నాడు జముర్రుద్‌ను అమ్ముతున్న యజమాని.

పాటగాడు చెయ్యెత్తి, "ఆహా, ఇలాటి బానిసను కొన్నవాడి అదృష్టమే అదృష్టం!" అంటూ అలీషార్‌ను సమీపించి, "ఈ రత్నం తమకు నూరోవంతు విలవకు దొరుకు తున్నది," అన్నాడు. అలీషార్ విధి తనను ఈ విధంగా పరిహసిస్తున్నందుకు తనలో తాను నవ్వుకుంటూ, "పూటకు టికాణా లేని వాడికి ఈ వర్తకుల మధ్య ఎలాటి తలవంపు!" అనుకున్నాడు.

జముర్రుద్ అతని కేసి ప్రోత్సాహకరంగా చూసింది గాని అతను తల వంచుకుని ఉండటం చేత ఆ చూపు అందుకోలేదు. అప్పుడామె పాటగాడితో, "నన్నతని దగ్గిరికి తీసుకు వెళ్ళు. నే నతనికే అమ్ముడవాలని నిశ్చయించుకున్నాను," అన్నది.

ఆమె పాటగాడి వెంట అతన్ని సమీపించి, "అయ్యా, నా హృదయంలో జ్యోతి వెలిగించారు. నోటి వెంట పాట ఎందుకు అనరు? నే నింకా ఎక్కువ విలువ చేస్తానని తోస్తే ఇంకా ఎక్కువ పలకండి. లేదా, తక్కువ పలకండి!" అని ప్రాధేయపూర్వకంగా అడిగింది.

అలీషార్ దైన్యంతో తల అడ్డంగా తిప్పి, "కొనవలసిన నిర్బంధం నాకూ లేదు, అమ్ముడవ వలిసిన నిర్బంధం నీకూ లేదు," అన్నాడు.

జముర్రుద్ అదుర్దాగా, "నేను వెయ్యి దీనారాలు చెయ్య ననుకున్నట్టున్నారు. తొమ్మిదివందలు పాడండి...పోనీ, ఎని

మిది వందలు!...ఏడు వందలు!...ఆరు వందలు!...ఒక్క వంద!" అన్నది.

అన్నిటికీ తల అడ్డంగా ఆడిస్తూ వచ్చిన అలీషార్, "అంత మొత్తం నా దగ్గిర లేదు," అన్నాడు. జముర్రుద్ ఆనందంతో, "అయితే ఎంత ఉన్నది? మిగతాది ఇంటికి పోయి పంపవచ్చు," అన్నది.

"పిచ్చిపిల్లా, నా దగ్గిర నూరు దీనారాలు కాదు గదా ఒక్క దీనారం లేదు. బంగారునాణెం కాదు గదా, వెండి దిరాము గాని, రాగిబొట్టు గాని లేదు. నన్ను గురించి ఎందుకు వృథా కాలయాపన చేస్తావు? మరొక కొనుగోలుదారును వెతుక్కో," అన్నాడు అలీషార్.

జముర్రుద్ అతనితో, "అయితే అయింది, కొనెయ్యండి. నా చేతి మీద కొట్టి, మీ పైబట్ట నా మీద పరిచి, నా నడుము చుట్టూ చెయ్యివేస్తే నన్ను కొన్నట్టే గుర్తు," అన్నది. అలీషార్ ఆమె కోరిన ప్రకారమే చేశాడు. అతను తన నడుము చుట్టూ చెయ్యి వేసేటప్పుడు ఆమె అతని చేతిలోకి ఒక సంచీ రహస్యంగా పెట్టి, "అందులో వెయ్యి దీనారాలున్నాయి. తొమ్మిది వందలు మా యజమాని కివ్వండి. నూరు మన ఖర్చులకు," అన్నది.



అలీషార్ ఆ సంచిలోని డబ్బులో తొమ్మిది వందలు జముర్రుద్‌ను అమ్మిన వాడి కిచ్చి ఆమెను తన బసకు తీసుకు పోయాడు. ఈ బస చాలా పేదగా ఉంటుందని జముర్రుద్ ముందుగానే ఊహించింది. ఇంటికి వస్తూనే ఆమె మరొక డబ్బు సంచీ అలీషార్ చేతిలో పెడుతూ, "బజారుకు వెళ్ళి ఇంటికి అవసరమైన కర్ర సామగ్రీ, తివాసీలూ, బాలీసులూ కొనండి. ఒక పెద్ద నల చదరపు పట్టు గుడ్డా, బంగారు దారమూ, వెండి దారమూ, ఏడు రంగుల దారపు ఉండలూ, ఒక పెద్ద సూదీ కొనుక్కురండి. భోజన



సామగ్రికూడా పట్టుకురండి," అని చెప్పింది. అలీషార్ బజారుకు వెళ్ళి ఆమె చెప్పినవన్నీ, భోజన పదార్థాలతో సహా తెచ్చాడు. జముర్రుద్ ఇల్లు చక్కగా అలంకరించి దీపాలు వెలిగించింది. ఇద్దరూ సుష్టుగా భోజనం చేశారు. ఆ విధంగా వారి దాంపత్య జీవితం ఆరంభమయింది.

జముర్రుద్ తెరలూ, తివాసీలూ తయారు చెయ్యటంలో గొప్ప నేర్పరి. ఆమె ఒక్క క్షణంకూడా విశ్రాంతి లేకుండా పని చేసి ఒక అందమైన తెర తయారు చేసింది. రంగు దారాలతో దానిపై అనేక జంతువులూ, పక్షులూ, ఫలవృక్షాలూ మొదలైనవి జీవకళ ఉట్టి పడేలాగా కుట్టింది. ఈ తెర తయారు కావటానికి వారం రోజులు పట్టింది. అది పూర్తి కాగానే జముర్రుద్ దానిని మడిచి అలీషార్ చేతికిస్తూ, "దీనిని ఏ దుకాణం లోనైనా సరే యాభై దీనారాలకు తక్కువ కాని ధరకు అమ్మెయ్యండి. ఎరిగిన వాడికే బేరం చెప్పండిగాని ముక్కు మొహం తెలియని దారే పోయేవాడితో మటుకు బేర మాడ వద్దు. అలా చేస్తే మనం కష్టాలపాలై పోగలం, జాగ్రత్త!" అని హెచ్చరించింది.

అలీషార్ ఈ నిబంధనకు సమ్మతించి, ఆమె తయారు చేసిన తెరను తెలిసిన దుకాణదారు కొకడికి యాభై దీనారాలకు అమ్మాడు. జముర్రుద్ అతని చేత మళ్ళీ తనకు కావలిసిన పట్టు చదరూ, దారాలూ వగైరాలు తెప్పించి, మరొక వారం శ్రమ పడి మరొక తెర తయారు చేసింది. దాన్ని కూడా అలీషార్ యాభై దీనారాలకు తనకు తెలిసిన ఒక దుకాణంలో అమ్మాడు.

ఈ విధంగా వారు తమ అవసరాలకు లోటు లేకుండా జీవిస్తూ వచ్చారు. ఆ రోజు కారోజు వారిద్దరి మధ్యా ప్రేమ అపారంగా పెరగసాగింది.

ఇలా ఉండగా ఒక రోజున—

—(ఇంకా వుంది)





# దేవుడి వరం

"పక్కింటి మామయ్యగారూ, అత్తయ్య గారూ పసుపు బట్టలు కట్టుకుని, తిరపతికి పోతున్నారు," అన్నారు పిల్లలు తాతయ్యతో.

"అవును, మరి. వాళ్ళకు మొక్కున్నది కాబోలు," అన్నాడు తాతయ్య.

"మొక్కుకోవటం దేనికి, తాతయ్యా?" అని పిల్లలు అడిగారు.

"డబ్బు కావాలనీ, ఉద్యోగాలు కావాలనీ, రోగాలు నయంకావాలనీ, పిల్లలు లేని వాళ్ళు పిల్లలు పుట్టాలనీ దేవుళ్ళకు మొక్కుకుంటారు," అన్నాడు తాతయ్య.

"దేవుడికి మొక్కుకుంటే డబ్బు ఇస్తాడా, తాతయ్యా?" అన్నారు పిల్లలు.

"ఇస్తాడనేగదా మొక్కుకుంటారు?" అన్నాడు తాతయ్య.

"అయితే, దేవుడి దగ్గిర డబ్బులుంటాయా, తాతయ్యా?" అని పిల్లలు అనుమానంగా అడిగారు.

"దేవుడి దగ్గిర డబ్బులుంటాయిట్రా, పిచ్చివాళ్ళల్లారా?" అన్నాడు తాతయ్య.

"అయితే మరి దేవుడు మొక్కుకున్న వాళ్ళకు డబ్బెట్లా ఇస్తాడు, తాతయ్యా?" అని ఒక పిల్లవాడు అడిగాడు.

"ఎలా ఇప్పిస్తాడో తెలియాలంటే ఒక చిన్న కథ చెబుతా వినండి," అంటూ తాతయ్య కథ ఆరంభించాడు:

ఒక ఊళ్ళో ఒక శివాలయం ఉండేదిట. గర్భగుడిలో శివలింగం ఉండేది. ఎదురుగా నంది విగ్రహం ఉండేది. ఒక పక్కగా పార్వతీ అమ్మవారి విగ్రహమూ, ఇంకో పక్కగా వినాయకుడి విగ్రహమూ ఉండేది.

రోజూ నియమంగా ఈ ఆలయానికి వెళ్ళే వారు ఇద్దరే ఉండేవారు. ఒకడు గ్రామంలో కల్లా గొప్ప ధనికుడు; లక్షాధికారి. రెండో వాడు అగర్భ దరిద్రుడైన ఒక కూలివాడు. ఒకరోజు లక్షాధికారి కొంచెం పొద్దుపోయి



ఆలయానికి వచ్చాడు. అతడు లోపలికి అడుగుపెట్టబోతూ ఉండగా లోన ఎవరో మాట్లాడుకునే మాటలు వినిపించాయి.

"ఏమండీ, ఆ కూలివాడు ఎన్నో ఏళ్ళ నుంచీ ఎంతో భక్తితో ఆలయానికి వచ్చి మిమ్మల్ని కొలుస్తున్నాడుగదా, వాడి బీదరికం ఎందుకు పోగొట్టరు?" అని ఒక ఆడ గొంతు ప్రశ్నించింది.

"అవును, పార్వతీ, అలాగే చేస్తాను. నాయనా విఘ్నేశ్వరుడూ, రేపు సూర్యాస్తమయం లోపల ఆ కూలివాడికి ఒక లక్ష రూపాయలు వచ్చే సదుపాయంచెయ్యి," అని ఒక మగగొంతు అన్నది.

"సరే, నాన్నా!" అని ఒక యువకుడి గొంతు పలికింది.

ఆ మాట్లాడుకున్నది పార్వతీ, శివుడూ, వినాయకుడూ అయి ఉంటారా అని లక్షాధికారి ఆశ్చర్యపడిపోయాడు. ఆలయంలోకి ప్రవేశించేసరికి అక్కడ ఎవరూ లేకపోవటంతో ఆయన అనుమానం ధృవపడింది.

"గంజికి గతి లేనివాడికి లక్షరూపాయలే! ఆ డబ్బుతో ఏం చేసుకోవాలోకూడా వాడికి తెలీదే! వాడికి సుఖంగా జరగాలంటే ఒక వంద చాలు. వెయ్యి అయితే కొల్ల!" అనుకున్నాడు లక్షాధికారి.

ఈ ఆలోచనతోనే దేవుడికి దణ్ణంపెట్టి మొక్కు తీర్చేసుకుని ఆయన ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రల్లా నిద్ర పట్టలేదు. వినాయకుడు లక్షరూపాయలూ ఇప్పించటమే జరిగితే కూలివాడు చాలా కష్టాలపాలైపోతాడనీ, వాణ్ణి ఆ కష్టాల నుంచి తప్పించాలనీ లక్షాధికారి నిర్ణయించుకున్నాడు.

అందుకు అతడేం చేశాడూ? తెల్లవారుతూనే ఆ కూలివాణ్ణి వెతుక్కుంటూ వెళ్ళి, ఎలాగైతేనేం పట్టుకున్నాడు. పట్టుకుని వాడితో, "అబ్బీ, ఇవాళ నీకు దొరికే డబ్బంతా నాకిచ్చేస్తివా నీకు నూరు రూపాయ లిచ్చేస్తాను," అన్నాడు.

కూలివాడు నిర్ఘాంతపోయి, "తమరు నాతో పరాచకాలాడుతున్నారు," అన్నాడు. పరాచకాలుకాదు నిజంగానే ఇస్తానన్నాడు లక్షాధికారి. కూలివాడు నమ్మలేదు.

"చూడూ, నూరు రూపాయలు కాదు వెయ్యిరూపాయ లిస్తాను. నువు మాత్రం నీ కివాళ దొరికిం దంతా నా కిచ్చెయ్యాలి," అన్నాడు లక్షాధికారి.

కూలివాడికి కోపం వచ్చింది. "మీ డబ్బు మీ దగ్గిరే ఉంచుకుని నా మానాన నన్ను బతక నివ్వండి," అన్నాడు వాడు.

"నేను అబద్ధమాడుతున్నానని నీ అనుమానం. వెయ్యికాదు, పదివేలిస్తాను. నిజం. నేను కోరేదల్లా ఏమంటే నీ కీ రోజు దొరికిం దంతా నా కివ్వాలి," అన్నాడు లక్షాధికారి.

"ఈ సంగతి నలుగురితోనూ చెబుదాం రండి! ఏం మాటలివి?" అంటూ కూలివాడు గొంతెత్తాడు. వాడు డబ్బు చూస్తేగాని నమ్మడనుకుని ఇంటికి వెళ్ళి లక్షాధికారి ఏకంగా యాభైవేలు తీసుకుని వచ్చాడు.

"ఇదుగో, అబ్బీ! ఈ డబ్బంతా నీదే, ఉంచుకో. యాభైవేలు! ఏమిటనుకున్నావ్? ఇందులో వేళాకోళం ఏమీలేదు. కాని నువు మాత్రం నీ కివాళ దొరికేది, అణా కానీ, అర్ధరూపాయికానీ, నా కిచ్చెయ్యాలి. ఇస్తా



నని శివుడి పైన ప్రమాణం చెయ్యి!" అన్నాడు లక్షాధికారి.

సాక్షాత్తూ శివుడే ఈ రూపంలో వచ్చి తనకు డబ్బిస్తున్నాడనుకుని కూలివాడు లక్షాధికారి కోరిన విధంగా ప్రమాణంచేశాడు. లక్షాధికారి తృప్తిపడి ఇంటికి వెళ్ళిపోయి, తనకు యాభైవేలు లాభం ఉంటుందిగదా అని గుటకలువేశాడు.

ఆ రోజు సాయంకాలం దాకా ఆగి లక్షాధికారి కూలివా డింటికి వెళ్లి, "ఏదీ? ఈ రోజు నీకేం దొరికింది? దొరికిందంతా ఇలా ఇచ్చెయ్యి. శివుడిపైన ప్రమాణం చేసి మాట ఇచ్చావు," అన్నాడు.

"బాబూ, ఇవాళ నాకు ఎ(ర ఏగానీ దొరకలేదు," అన్నాడు కూలివాడు.

శివుడూ, పార్వతీ, విఘ్నేశ్వరుడూ కలిసి తనను మోసగించారా అని లక్షాధికారికి అనుమానం కలిగింది. దడదడలాడే గుండెతో అతడు శివాలయానికి వెళ్ళాడు. మళ్ళీ లోపలి నుంచి మాటలు వినిపించాయి.

"నాయనా, విఘ్నేశ్వరుడూ, ఆ కూలి వాడికి లక్ష ఇప్పించమన్నానే, ఇప్పించావా?" అని శివుడు అడిగాడు.

"లక్షాధికారి చేత ఒక అరలక్ష ఇప్పించాను, నాన్నా. ఇప్పుడే మిగిలినదికూడా ఇప్పిస్తాను," అన్నాడు విఘ్నేశ్వరుడు.

లక్షాధికారికి మండిపోయింది. అతడు చరచరా లోపలికి వెళ్ళి విఘ్నేశ్వరుడి వి(గహం యొక్క చెయ్యి పట్టుకుని, "నా డబ్బు ఆ దరి(దుడికి ఇప్పించటానికి మధ్య నీ వెవడివి! ఇదేనా మీ దాతృత్వం?" అని కేకలుపెట్టాడు.

అప్పుడేమయిందనుకున్నారు? విఘ్నేశ్వరుడి తొండం లక్షాధికారి చేతిని ఒడిసి పట్టుకున్నది. రాతి తొండమేమో లక్షాధికారి చెయ్యి అటూ ఇటూ కదలలేదు.

"అయ్యో, అయ్యో! ఇదే మన్యాయం? ఓ విఘ్నేశ్వరుడా, నా చెయ్యి వదిలిపెట్టు!" అని లక్షాధికారి మొరపెట్టాడు.

"ఆ కూలివాడికి మిగిలిన అరలక్ష ఇచ్చేదాకా నీ చెయ్యి వదిలేది లేదు!" అన్నాడు విఘ్నేశ్వరుడు. తప్పేదేముందీ? కూలివాడికి మిగిలిన అరలక్ష కూడా ఇస్తానని శివుడి మీద (పమాణం చేశాక లక్షాధికారి చెయ్యి ఊడి వచ్చింది. ఎంతచెడ్డా శివభక్తుడే గనక అన్నమాట చొప్పున అతడు కూలి వాడికి మరో యాభైవేలు ఇచ్చుకున్నాడు.

"కనక దేవుడైనా ఉన్నవాళ్ళ దగ్గిర నుంచి లేనివాళ్లకు ఇప్పించవలిసిందేనూ!" అంటూ తాతయ్య రొండి నుంచి పొడుం కాయ తీశాడు.






# తోడేలు రూపు

బ్రిటనీలోని ఒక దుర్గంలో ఒక సామంతు డుండే వాడు. ఇతను యువకుడు, రాజుకు అభిమాన పాత్రుడు. ఇతని భార్య అంద గత్తె. మహసాధ్విలాగా కనబడేది, అలాగే ప్రవర్తించేది. కాని నిజానికి ఈమె స్వభావం మంచిది కాదు. పైకి భర్తపైన ఎంత ప్రేమ ఉన్నట్టు నటించేదో లోపల అతన్ని అంతగా ద్వేషించేది. ఆమె మరొక సామంతును ప్రేమించి, వీలయితే అతడికి భార్య అయేం దుకు తహతహ లాడుతూండేది.

ఆమె తన భర్తను గురించి ఒక విషయం గమనించింది. అతను వారానికి మూడు రోజులు ఎటో వెళ్ళి తిరిగి వచ్చే వాడు. ఈ మూడు రోజులూ అతను ఎటు వెళ్ళేవాడో, ఏమి చేసేవాడో అతని భృత్యు లకుగాని, భార్యకుగాని తెలియదు.

ఇందులో ఏదో రహస్యం ఉన్నదనీ, అది తనకు తెలిసినట్టయితే ఏదో ఒక విధంగా లాభించవచ్చుననీ ఆమె అను కున్నది. అందుచేత ఆమె ఒకనాడు తన భర్తతో లాలసగా, "ఏమండీ, మీరు వారా నికి మూడు రోజులు నన్ను ఒంటిగా విడిచి ఎటో వెళ్ళిపోతున్నారు. ఇందువల్ల నా కెంత బాధో ఆలోచించారా?" అన్నది.

"నేనేం చేసేది? తప్పనిసరి అయి వెళు తున్నాను. బుద్ధి పూర్వకంగా నిన్ను విడిచి ఒక క్షణం ఉండగలనా?" అన్నాడు భర్త.

"అంత తప్పనిసరి ఏమి వచ్చింది? నాకు కాస్త చెప్ప గూడదా?" అన్నది భార్య. ఆమె చాలా నిర్బంధించిన మీదట, రహస్యం ఎవరికీ చెప్పనని ఆమె చేత ప్రమాణం చేయించుకుని ఆ సామంతు, "నేను వారానికి మూడు రోజులు విధిగా తోడేలు రూపు ధరించి, అరణ్యంలో సంచ రిస్తాను. ఇది నాకు చుట్టుకున్న ప్రారబ్ధం," అని చెప్పాడు.

ఫ్రెంచి జానపద గాథ




"ఈ మార్పు ఎలా జరుగుతుంది?" అని భార్య అడిగింది.

"అరణ్యంలోకి వెళ్ళి, నా దుస్తులన్నీ తీసి ఒక చోట గుర్తుగా పెట్టేస్తాను. వెంటనే నాకు తోడేలు రూపు వస్తుంది. మూడు రోజులూ తోడేలుగా జీవించాక నా దుస్తులు తిరిగి ధరించగానే మనిషి రూపు వచ్చేస్తుంది," అన్నాడు భర్త.

"అయితే ఆ దుస్తులు ఎక్కడ దాస్తారేమిటి?" అని భార్య అమాయికంగా అడిగినట్టు అడిగింది.

"అది పరమ రహస్యం. ఇంకొకరికి చెప్పేది కాదు. ఎందుకంటే ఆ దుస్తులు నాకు తిరిగి దొరకక పోయాయో నేను తోడేలు రూపుతో ఉండి పోవలిసినవాణ్ణే!" అన్నాడు భర్త.

ఈ మాట విని ఆ దుర్మార్గురాలు తనలో చాలా సంతోషించింది. కాని ఆ దుస్తులు దాచే రహస్య స్థలం చెప్పమని బతిమాలటం మానలేదు. ఆమెకు తనపై అంతులేని ప్రేమ అన్న గట్టి నమ్మకంతో అతను చివరకు తాను దుస్తులు దాచే స్థలం వివరాలు చెప్పేశాడు: "అడవిలో ఒక పాడుబడిన ఆలయం ఉన్నది. దాని పక్కనే పొదల మధ్య రాతిలో ఒక అదృశ్యంగా ఉండే తొర్ర ఉన్నది. ఆ తొర్రలో నా దుస్తులు దాస్తాను."

ఈ రహస్యం తెలియటంతో ఆమెకు తన భర్తను వదిలించుకునే ఉపాయం తెలిసిపోయింది. ఈసారి అతను అడవికి వెళ్ళి పోగానే ఆమె తన ప్రియుడికి కబురు చేసి అతనికి తన భర్త రహస్య మంతా చెప్పేసింది. ఆమె కోరికపై అతను అడవి లోని పాడుపడిన ఆలయం వద్దకు వెళ్ళి, ఆమె భర్త దుస్తులు తెచ్చి ఆమె కిచ్చేశాడు. ఆమె వాటిని ఒక భోషాణంలో దాచేసింది.

తోడేలు రూపంలో ఉన్న సామంతు మూడు రోజులపాటు అరణ్యంలో తిరిగి

తన దుస్తుల కోసం వచ్చి చూస్తే అవి లేవు. తన భార్య తనకు ద్రోహం చేసిందని అతనికి అర్థమయింది గాని, దానికి ప్రతి క్రియ చేసే అవకాశం అతనికి లేదు. ఎందుకంటే, అతను ఈ తోడేలు రూపంతో అడవిదాటి వెళితే కుక్కలూ, మనుషులూ అతని ప్రాణాలు తీయవచ్చు. అందుచేత అతను అరణ్యంలోనే ఉండిపోయాడు.

కొన్ని వారాలపాటు అతని భార్య భర్త కోసం దొంగ కన్నీరు కార్చి చివరకు తన ప్రియుణ్ణి పెళ్ళాడి, తన యుక్తి పారి నందుకు ఎంతో సంతోషించింది.




ఒక సంవత్సరంపాటు సామంతు తోడేలు రూపంలో అరణ్యమంతటా తిరుగుతూ, కనబడిన ప్రాణినల్లా చంపి తింటూ అచ్చగా తోడేలులాగే జీవించాడు.

ఆ తరవాత రాజుగారు ఒక రోజున ఆ అరణ్యానికి వేటకు వచ్చాడు. ఆయన వెంట ఉన్న వేటకుక్కలు తోడేలు వాసన పసికట్టి, మొరుగుతూ దాని కోసం వేటాడ సాగాయి. రాజూ, ఆయన వెంట ఉన్న వేటగాళ్ళూ కుక్కల వెనకగా గుర్రాల మీద పరిగెత్తారు.

తోడేలు వేటకుక్కలకు అందకుండా ఎన్నో గంటలసేపు పరిగెత్తింది. సాయంకాలం అయేసరికి దాని పని అయిపోయింది. ముళ్ల పొదలు దాని శరీరమంతా రక్కేశాయి. చావుకు సిద్ధపడి ఆ తోడేలు ఒక చోట నిలిచిపోయింది. ఇంతలో కుక్కలూ, వాటి వెనకగా మనుషులూ తనను సమీపించటం దానికి కనబడింది. తనపై ఎంతో అభిమానం గల రాజును అది గుర్తించింది. మరుక్షణమే అది రాజును సమీపించి, ఒక పాదం ఎత్తి రికాబు మీద ఉంచి, మోరచాచి రాజుగారి పాదం మీద ఆనించింది.

ఈ విచిత్రమైన చర్యచూసి రాజు నిర్ఘాంతపోయి, "ఏమిటిది? ఈ తోడేలు నన్ను శరణు వేడుతోంది. వేట కుక్కలను

పట్టుకోండి. ఈ తోడేలును అరణ్యంలో విడిచిపుచ్చుదాం," అన్నాడు.

రాజు తోడేలును విడిచినా, తోడేలు రాజును విడవలేదు. ఇంటికి తిరిగి పోయే రాజుగారి గుర్రం పక్కనే అది కుంటుతూ నడవసాగింది. ఇది చూసి పరివారంలో ప్రతి ఒక్కరూ ఆశ్చర్యపడ్డారు.

రాజ భవనం దాకా వచ్చిన తోడేలును చూసి రాజు, "దీనికి నా రక్షణ కావాలి లాగుంది. అలాగే ఇస్తాను. దీనికి రోజూ మాంసం పెట్టి జాగ్రత్తగా పోషించండి. ఎవరుగాని దీనికి ఎలాటి హాని చేయవద్దు," అని ఆజ్ఞాపించాడు.

అదిమొదలు ఆ తోడేలు రాజప్రాంగణంలో ఉంటూ, పెంపుడు కుక్కలాగా అస్తమానం రాజుగారి వెనకే తిరుగుతూ ఉండేది. ఎవరిజోలికీ పోక ఎంతో సాధువులాగా ఉండేది. పగలల్లా అది రాజుగారిని అంటిపెట్టుకుని ఉండి, రాత్రివేళ ఆయన మంచం పక్కనే పడుకునేది.

క్రమంగా రాజుగారికి తన వేటకుక్కల మీద కన్నకూడా ఈ తోడేలు మీద హెచ్చు మమకారం ఏర్పడింది.

ఇది జరిగిన కొద్ది రోజులకే రాజుగారు రాచకార్యం ఒకటి వచ్చి తన సామంతుల నందరినీ రాజభవనంలో హాజరు కమ్మని



ఆజ్ఞాపించాడు. ఈ సామంతులలో తోడేలు రూపు ధరించినవాడి దుస్తులు కాజేసి, అతని భార్యను పెళ్ళాడిన వాడు కూడా ఉన్నాడు. అతణ్ణి చూడగానే తోడేలు కోపంతో గుర్రుపెట్టి, అతడి మీదికి లంఘించి కింద పడేసింది. అది అతని పీక కొరికే లోపుగా ఇతరులు వచ్చి తోడేలును లాగే శారు. ఆ రోజు ఇదే సంఘటన మూడుసార్లు జరిగింది. ఇది చూసి రాజుగారు ఆశ్చర్య పడ్డాడు. అది ఎవరి జోలికీ ఎన్నడూ పోదు. అలాటిది ఈ ఒక్క సామంతుపైన ఎందుకు మూడుసార్లు పడింది? ఈ సందేహం ఇలా ఉండగా రాజుకు మరొక భయంకూడా పట్టుకుంది: తోడేలు తన సామంతును చంపవచ్చు, ఇతరులు తోడేలును చంప వచ్చు; ఇందులో ఏది జరగటమూ ఆయన కిష్టం లేదు. అందుచేత ఆయన తన సామంతులందరూ వెళ్ళిపోయినదాకా తోడే లును గొలుసుపెట్టి కట్టేయించాడు.

ఇది జరిగిన కొంతకాలానికి రాజుగారు అదే అరణ్యానికి వేటకు వెళ్ళి అరణ్యం మొదట్లో ఉన్న విశ్రాంతి గృహంలో విడిది చేశాడు. ఈ విశ్రాంతిగృహం తోడేలు రూపంలో ఉన్న సామంతుదే. రాజుగారు వచ్చినట్టు తెలిసి ఆ సామంతు పూర్వ భార్య, రాజుగారిని మెప్పించి, తన రెండో



భర్తకు లాభం కలిగించాలనే ఉద్దేశంతో నౌకర్ల చేత కానుకలు మోయించుకుని, రాజుగారున్న బసకు వచ్చింది.

ఆమె రాజుగారి సమక్షంలోకి వచ్చిన మరుక్షణమే రాజుగారి చెంతనే ఉన్న తోడేలు ఆమె పైకి లంఘించి గొంతు కొరకబోయింది. ఆమె కెవ్వున అరిచింది. అక్కడ ఉన్న వారంతా కత్తులు దూసి తోడేలును చంపబోయారు. రాజుగారు వారిని నివారించకపోతే తోడేలు ఆ క్షణంలో చచ్చిఉండేదే!

రాజుగారు తోడేలుకు ఏ అపాయమూ రాకుండా తన చేతులలో పొదివి పట్టుకుని, "ఈమె పూర్వ భర్త నా మిత్రుడు. అతను ఏమయాడో, ఎటు వెళ్ళిపోయాడో ఎవరికీ తెలియదు. ఈమె రెండో భర్త అతని భార్యనూ, అతని ఆస్తినీ సొంతం చేసుకున్నాడు. ఎవరికీ అపకారం చెయ్యని ఈ తోడేలు వీరిద్దరినీ చూసి ఆగ్రహం చూపింది. ముందు ఈ భార్యా భర్తలను తీసుకుపోయి చీకటి కొట్టులో బంధించండి. తరవాత నిలకడమీద నిజమేమిటో తేలుతుంది," అన్నాడు.

సామంతు భార్య కొద్ది రోజులు చీకటి కొట్టు అనుభవించాక రాజుగారి దగ్గిర జరిగినదంతా చెప్పి తన నేరం ఒప్పుకున్నది.

రాజుగారు భోషాణంలో ఉండిన సామంతు దుస్తులు తెప్పించి, వాటినీ తోడేలునూ ఒక గదిలో ఉంచాడు. కొంతసేపయాక సామంతుడు తన మానవ రూపుతో ప్రత్యక్షమయాడు.

రాజుగారు అతని దుష్ట భార్యకూ, ఆమెను పెళ్ళాడిన వాడికీ దేశబహిష్కార శిక్ష విధించి తన మిత్రుడికి అతని ఆస్తి ఇప్పించేశాడు. అయితే అతను తన దుర్గంలో ఉండక ఎప్పుడూ రాజభవనంలో ఉంటూ, వారానికి నాలుగు రోజులు మనిషిగానూ, మూడు రోజులు తోడేలుగానూ రాజుగారి సాన్నిధ్యం వదలకుండా జీవించాడు.






ముందు రాముడూ, వెనక సీతా, సీత వెనకగా అస్త్రాలు చేపట్టి లక్ష్మణుడూ నడుస్తూ మునులను వెంటబెట్టుకుని అనేక పర్వతాలూ, నదులూ, సరస్సులూ, కొలనులూ, పక్షుల సమూహాలూ, ఏనుగుల మందలూ, ఎనుబోతుల మందలూ, అడవి పందుల మందలూ చూశారు.

సూర్యాస్తమయ సమయానికి వారు ఒక అందమైన సరస్సు చేరుకున్నారు. సరస్సు అడుగు నుంచి చక్కని గీతవాద్య ధ్వనులు రావటం చూసి రామ లక్ష్మణులు ఆనందాశ్చర్యాలు పొంది, ధర్మభృత్తనే మునిని, "ఏమిటీ వింత? రహస్యం కాని పక్షంలో చెప్పండి, విని ఆనందిస్తాము," అని అడిగారు.

వారికి ధర్మభృత్తు ఆ సరస్సు పుట్టు పూర్వోత్తరాలు తెలిపాడు. ఆ సరస్సు పేరు పంచాప్సరం. దీనిని మాండకర్ణి అనే మహాముని తన తపశ్శక్తి చేత నిర్మించాడు. ఆ మహాముని వాయు భక్షణచేస్తూ పదివేల సంవత్సరాలు అతి దారుణమైన తపస్సు చేసే సరికి, అగ్ని మొదలుగాగల దేవతలు భయపడి, ఆ ముని తమలో ఎవరిస్థానమో కాజేస్తాడని రూఢి చేసుకుని, తపో భంగం చెయ్యటం కోసం మెరుపు తీగల్లాటి అయిదుగురు అప్సరసలను ఏరి మాండకర్ణి వద్దకు పంపారు. వారి ఎత్తు పారింది. మాండకర్ణి వారి వ్యామోహంలో పడి, తన తపశ్శక్తి ధారపోసి ఈ సరస్సు సృష్టించి, తాను యౌవన దేహం ధరించి, నీటి అడుగున



పది సంవత్సరాల అనంతరం రాముడు సీతా లక్ష్మణులతో తిరిగి సుతీక్ష్ణ మహా ముని ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ ఉంటూ అతను ఒకనాడు మహామునితో, "ఈ మహారణ్యంలో ఎక్కడో అగస్త్యుల వారు ఉంటున్నారని వారూ వారూ అనగా విన్నాను. కాని స్పష్టంగా వారి ఆశ్రమం ఎక్కడ ఉన్నదీ చెప్పినవారు లేరు. మీరు తెలిపినట్టయితే మేము ముగ్గురమూ వెళ్ళి వారి దర్శనం చేసుకుంటాము. ఆయనకు శుశ్రూష చేయాలని నాకు చాలా కుతూహలంగా ఉన్నది," అన్నాడు.

అప్సరసల నిమిత్తం అదృశ్య హర్మ్యాలు నిర్మించి, వారిని భార్యలుగా చేసుకుని నృత్యగాన వినోదాలతో కాలక్షేపం చేస్తున్నాడు.

ధర్మభృత్తు చెప్పిన ఈ కథ వింటూ సీతా రామ లక్ష్మణులు ఆశ్రమ సమూహాలను చేరుకున్నారు. ఆశ్రమవాసులు రాముడికి గొప్పగా అతిథ్యం ఇచ్చారు. రాముడు తన భార్యతోనూ, తమ్ముడితోనూ ఒక్కొక్క ఆశ్రమంలోనూ తన ఇష్టానుసారం ఒక సంవత్సరమో, ఎనిమిది మాసాలో, ఆరు మాసాలో, మూడు మాసాలో ఉంటూ సుఖంగా పది సంవత్సరాలు గడిపాడు.

ఈ మాట వినగానే సుతీక్ష్ణుడు, "నేను కూడా నీకు అదే సలహా ఇవ్వాలనుకుంటున్నాను. ఇంతలో నీవే అడిగావు. ఇక్కడికి దక్షిణంగా నాలుగామడలు పోతే అగస్త్యుడి తమ్ముడి ఆశ్రమం వస్తుంది. అక్కడికింకా ఒక ఆమడ దూరంలో అగస్త్యుడి ఆశ్రమం ఉన్నది. అవి చాలా అందమైన ఆశ్రమాలు. అక్కడ మీ ముగ్గురికీ చాలా ఆనందంగా ఉంటుంది. వెళ్ళాలని ఉంటే వెంటనే బయలుదేరండి," అన్నాడు.

రాము డాయనకు నమస్కారం చేసి సీతా లక్ష్మణులతో బయలుదేరి అగస్త్య మహాముని తమ్ముడి ఆశ్రమానికి చేరాడు.

అ సమయంలోనే రాముడు లక్ష్మణుడికి అగస్త్య మహిమ చెబుతూ వాతాపి ఇల్వలుల వృత్తాంతం చెప్పాడు.

ఇల్వలుడూ, వాతాపీ అని ఇద్దరు రాక్షసులుండేవారు. వారు ఎందరో బ్రాహ్మణులను మోసగించి చంపేశారు. ఇల్వలుడు బ్రాహ్మణ వేషం ధరించి, సంస్కృత భాషలో మాట్లాడుతూ బ్రాహ్మణుల వద్దకు వెళ్ళి, "అయ్యా, ఇవాళ మా ఇంట శ్రాద్ధం. తమరు భోక్తగా దయచెయ్యాలి," అని కోరేవాడు. నిజమే ననుకుని బ్రాహ్మణులు వచ్చేవారు. ఈ లోపుగా వాతాపి మేకరూపం ధరించేవాడు. ఇల్వలు డా మేకను కోసి బ్రాహ్మణులకు పెట్టేవాడు. బ్రాహ్మణులా మేకను పూర్తిగా తిన్నాక ఇల్వలుడు, "వాతాపీ, ఇక వచ్చెయ్యి," అనేవాడు. అప్పుడు వాతాపి మేకలాగా అరుచుకుంటూ ఆ బ్రాహ్మణుల పొట్టలు చీల్చుకుని వచ్చేవాడు.

ఈ విధంగా వారు అనేక వేల బ్రాహ్మణులను చంపిన మీదట ఇల్వలుడికి అగస్త్య మహాముని తటస్థపడ్డాడు. ఇల్వలుడి కోరికపై ఆయన భోజనానికి వచ్చి అతడు పెట్టిన మేక మాంసం తిన్నాడు. ఆయన తృప్తిగా భోజనం చేశానన్న అనంతరం



ఇల్వలు డాయనకు హస్తోదకం ఇచ్చి, "ఇక రా వాతాపీ!" అని కేక పెట్టాడు.

అగస్త్యుడు నవ్వుతూ, "ఇంకెక్కడి వాతాపి? వా డప్పుడే జీర్ణమై, యముడి ఇంటికి చేరుకున్నాడు!" అన్నాడు. ఇల్వలుడు తన తమ్ముడు చచ్చాడని తెలిసి మండిపడి అగస్త్యుడి పైకి లేచి ఆయన చూపుల వేడికే బూడిద అయిపోయాడు.

రాముడీ కథ చెప్పి లక్ష్మణుడితో, "అంత శక్తిమంతుడైన అగస్త్యులవారి తమ్ముడి ఆశ్రమం ఇది," అన్నాడు. అప్పటికే సూర్యాస్తమయ మయింది. అగస్త్యుడి తమ్ముడు సీతా రామ లక్ష్మణులకు అతిథ్యం



ఇచ్చాడు. వారా రాత్రి అక్కడే గడిపి, మర్నాడు ఉదయం ఆయన వద్ద సెలవు పుచ్చుకుని అగస్త్యాశ్రమానికి బయలు దేరారు. దారిలో వారికి ఏనుగులు విరిచే సిన చెట్లు కనబడ్డాయి, మనోహరంగా పక్షులు పాడే పాటలు వినపడ్డాయి. అగస్త్యాశ్రమం పరిసరాలు అరణ్యంలాగా లేక ప్రశాంతంగానూ, అందంగానూ ఉండటం రామ లక్ష్మణులు గమనించారు.

రాముడు లక్ష్మణుడితో, "అగస్త్యుడు మహిమాన్వితుడు. సూర్యుడి మార్గానికి అడ్డంగా పెరుగుతూ వచ్చిన వింధ్య పర్వతాలను నిగ్రహించాడు. ఆయన దక్షిణ దేశానికి వచ్చి స్థిరపడినాక, దక్షిణానికి అగస్త్యుడి దిక్కనే పేరు వచ్చింది. ఆయన ఆశ్రమం అతి పవిత్రమైనది; అందులో క్రూరులూ, వంచకులూ, పాపులూ నివసించలేరు. అలాటి చోటికి చేరుకున్నాం. లక్ష్మణా, నీవు ముందు వెళ్ళి, నేనూ సీతా వస్తున్నామని అగస్త్యులవారితో చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడు ఆశ్రమం ప్రవేశించి, అగస్త్యుడి శిష్యులలో ఒకణ్ణి పట్టుకుని, "నేను దశరథమహారాజు కొడుకును, లక్ష్మణుడనే వాణ్ణి. నేనూ, మా అన్న అయిన రాముడూ, ఆయన భార్య అయిన సీతా అగస్త్యులవారి దర్శనార్థం వచ్చాం. కనుక వారితో ఈ సంగతి చెప్పు," అన్నాడు.

అగ్నిహోత్ర గృహంలో ఉన్న అగస్త్యుడికి శిష్యుడీ వార్త చెప్పాడు. వెంటనే అగస్త్యుడు, "వారు వస్తారని అనుకుంటూనే ఉన్నాను. వారు ఆశ్రమంలోకి రాదగిన వారే; నీవు అప్పుడే తీసుకురావలిసింది. వెంటనే వెళ్ళి వారిని లోపలికి తీసుకురా," అన్నాడు. శిష్యుడు గబగబా వచ్చి లక్ష్మణుడితో, "ఆ సీతారాములెక్కడ ఉన్నారు? వెంటనే రమ్మనండి," అన్నాడు.

ఇద్దరూ కలిసి ఆశ్రమ ద్వారం వద్దకు వెళ్ళారు. శిష్యుడు అతి వినయంగా సీతా

రాములకు స్వాగతం చెప్పి లోపలికి తీసుకు వచ్చాడు. అగస్త్యుడు సూర్య తేజస్సుతో వెలిగిపోతూ శిష్యులతో సహా ఎదురు వచ్చాడు. అగస్త్యుణ్ణి రాముడు ఆ తేజస్సు చేతనే గుర్తించాడు. సీతారామ లక్ష్మణు లాయన కాళ్ళకు వందనం చేసి, చేతులు మోడ్చి నిలబడ్డారు.

అగస్త్యుడు వారిని అతిథులుగా స్వీక రించి, ఆసనాలూ, అర్ఘ్యపాద్యాలూ యిచ్చి, కందమూల ఫలభోజనం వారికి పెట్టాడు.

అగస్త్యుడి వద్ద ఒక అపూర్వమైన ధను వున్నది. అది విష్ణువుది; బంగారు నగిషీలు కలిగి, రత్నాలు పొదిగినది. దానిని విశ్వ కర్మ తయారుచేశాడు. బ్రహ్మదేవు డిచ్చిన ఒక అపూర్వమైన బాణమూ, ఇంద్రు డిచ్చిన రెండు అక్షయబాణ తూణీరాలూ, బంగారు ఒరగల ఒక ఖడ్గమూ ఉన్నాయి. వీటి నన్నిటినీ అగస్త్య మహాముని రాముడికి కానుకగా ఇచ్చేశాడు.

తరవాత ఆయన రాముడితో, "నాయనా, నాకు నమస్కారం చెయ్యటానికి మీరు ఇంత దూరం వచ్చారు, చాలా సంతోషం. మీరంతా బడలి ఉంటారు. అతి సుకుమారి, కష్ట సమయంలోకూడా భర్తను విడవని మహా పతివ్రత, సీత మరింత అలసి



ఉంటుంది. కనుక మీరంతా విశ్రాంతి తీసుకోండి," అన్నాడు.

"నా అరణ్యవాస దీక్ష పూర్తి అయేదాకా మేము ఆశ్రమం నిర్మించుకుని నివసించ టానికి యోగ్యమైన స్థలం ఉంటే చెప్పండి," అని రాముడు అగస్త్యుణ్ణి అడిగాడు.

"ఇక్కడికి రెండామడల దూరంలో పంచవటి ఉన్నది. నీరూ, దుంపలూ సమృద్ధిగా ఉన్నాయి. లేళ్ళుకూడా జాస్తి. అక్కడ నీవు ఆశ్రమం ఏర్పరచుకోవచ్చు. నీ వనవాసం చాలాభాగం అయేపోయింది. ఆ మిగిలినది కాస్తా పూర్తి కాగానే తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖంగా రాజ్యం చేసు



కుంటావు. కావలిస్తే నీవు నా ఆశ్రమంలోనే ఉండవచ్చు. కాని నీకు వేరే ఆశ్రమంలో ఉండాలని ఉన్నట్టున్నది. అందుచేత పంచవటి పేరు చెప్పాను. అది చాలా అందమైన చోటు, సీతకు చాలా బాగుంటుంది. అదుగో, ఆ కనిపించే ఇప్ప చెట్ల సమూహానికి ఉత్తరంగా వెళితే ఒక మర్రిచెట్టు వస్తుంది. దాన్ని దాటి మరి కొంతదూరం పోతే ఒక ఎత్తు ప్రదేశం వస్తుంది. ఆ మిట్ట ఎక్కి చూస్తే ఒక పర్వతమూ, దాని పక్కన గోదావరీనదీ, దాని ఒడ్డున పంచవటీ కనిపిస్తాయి," అని అగస్త్యుడు చెప్పాడు.

సీతారామ లక్ష్మణులు అగస్త్యుడికి నమస్కరించి ఆయన అనుజ్ఞ పొంది ఆయన చెప్పినదారినే పంచవటికి బయలు దేరారు. దారి మధ్యలో వారికొక బ్రహ్మాండ మైన గద్ద కనబడింది. దాన్ని చూసి రామ లక్ష్మణులు ఎవరో రాక్షసుడనుకుని, "ఎవరు నీవు?" అని ప్రశ్నించారు. ఆ గద్ద వారితో చాలా మంచిగా, "నాయనలారా, నేను మీ తండ్రి దశరథ మహారాజు స్నేహితుణ్ణి. నా కులగోత్రాలు చెబుతాను. దక్షప్రజాపతికి అరవైమంది కూతుళ్ళు. వారిలో ఎనిమిది మందిని కశ్యపుడు పెళ్ళాడాడు. వారిలో తామ్ర అనే ఆమె అయిదుగురు ఆడ పిల్లలను కన్నది. వారిలో ఒకతె శుకి. శుకి కూతురు నత. నత కూతురు వినత. వినతకు గరుడుడూ, అరుణుడూ అని ఇద్దరు కుమారులు. అరుణుడు మా తండ్రి, శ్యేని మా తల్లి. నాకు సంపాతి అని అన్న ఉన్నాడు. నా పేరు జటాయువు. ఇది చాలా భయంకర మైన అరణ్యం. ఎన్నో క్రూరమృగాలు, ఎందరో రాక్షసులు. అందుచేత మీ కభ్యంతరం లేకపోతే మీ వెంట ఉండి మీరిద్దరూ ఎటైనా వెళ్ళినప్పటికీ సీతకు నేను అండగా ఉంటాను," అన్నది.

జటాయువు వృత్తాంతం విని రాముడు చాలా సంతోషించి అతణ్ణి కౌగలించుకుని, తన తండ్రిని గురించి కబుర్లాడుతూ, సీతా లక్ష్మణ జటాయువులతో సహ పంచవటి చేరుకున్నాడు.

పంచవటి విషసర్పాలతోనూ, క్రూర మృగాలతోనూ, బాగా పూచిన చెట్లతోనూ నిండి ఉన్నది.

"లక్ష్మణా, ఇదే పంచవటి. నీకూ, నాకూ, సీతకూ సుఖంగానూ, నీటికీ, ఇసక దిబ్బలకూ, దర్భలు మొదలైన వాటికీ దగ్గిరగానూ ఉండే చోటు చూసి పర్ణశాల నిర్మించు," అన్నాడు రాముడు.

"అన్నా, నీవే అలాటి చోటు చూసి, పర్ణశాల నిర్మించమని ఆజ్ఞ ఇయ్యి, నీ ఆజ్ఞ నిర్వర్తిస్తాను." అన్నాడు లక్ష్మణుడు.

రాముడు ఒక సమప్రదేశం చూసి అక్కడ పర్ణశాల నిర్మించమని లక్ష్మణుడికి చెప్పాడు. ఆ ప్రదేశం గోదావరికి సమీపంగా ఉన్నది. లక్ష్మణుడు మట్టి తవ్వి గోడలు పెట్టాడు; వెదురు స్తంభాలు బలమైనవి నిలబెట్టి, వాటిపైన జమ్మికొమ్మలు పరిచి, తాళ్ళతో గట్టిగా కట్టి, వాటిపైన రెల్లుతోనూ, దర్భలతోనూ మంచి కప్పు వేశాడు; పర్ణశాల అందంగా కుదిరింది. లక్ష్మణుడు పర్ణశాల లోపలి నేల అంతా చక్కగా చదునుచేశాడు.

రాముడు గోదావరికి వెళ్ళి, స్నానం చేసి పద్మాలూ, ఫలాలు తెచ్చాడు. లక్ష్మణుడు పర్ణశాలకు పుష్పబలి చేసి శాంతి జరిపాడు.

ఇంతపనీ చేసినందుకు రాముడు లక్ష్మణుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, "లక్ష్మణా, నీవు నన్ను ఇలా కనిపెట్టి ఉంటే నాకు మన తండ్రి జీవించి ఉన్నట్టే ఉన్నది," అన్నాడు.

ఆ పర్ణశాలలో సీతారామలక్ష్మణులు సుఖంగా నివసించారు.



ప్రపంచపు వింతలు :

# 11. ఇన్కా వంతెన

ఆర్జంటీనా లోని అండీస్ పర్వతాలలో, సముద్ర మట్టానికి 9000 అడుగుల ఎత్తున ఉన్న ఈ ఇన్కా వంతెన సహజంగా ఏర్పడినది. మెండోజా అనే నది అనేక శతాబ్దాలపాటు కొండను తొలిచి ఈ వంతెనను సృష్టించింది. ఈ వంతెనకు కిందుగా ప్రవహించేది ఆ నదే.





# ప్రశ్నోత్తరాలు

1. *యం. యస్. నారాయణ, గుండుగొలను*

రావణుడంటి రాక్షసుడే సీతను తాకటానికి భయపడ్డాడు. అటువంటిది—ఇటువంటి ప్రశ్నలు ఇంకా పాఠకులు వేస్తూనే ఉన్నారు. మేము వాల్మీకి రాసిన కథే వేస్తున్నామని వారికి నమ్మకం చిక్కకుండా ఉన్నది. రావణుడు సీతను అంటుకోనట్టు వాల్మీకి రాయలేదు; ఎడమ చేత్తో సీత జుట్టూ; కుడిచేత్తో సీత తొడలూ పట్టుకుని తీసుకుపోయినట్టు వాల్మీకి రాశాడు. (వాల్మీకి రామాయణం—అరణ్యకాండ—49వ సర్గలో 17–18 శ్లోకాలు చూడండి.)

2. *బి. పాపన్న, గూడుపల్లి*

మీరు ప్రచురిస్తున్న రామాయణం కథను అరణ్యకాండ వరకు చదివితిని. కాని అందులో లక్ష్మణుని భార్యను గూర్చి వ్రాయలేదు. ఆమె పేరేమి?

లక్ష్మణుడి భార్య ఊర్మిళ. జనక మహారాజు సొంత కూతురు. సీతను రాముడికి పెళ్ళి చేసినప్పుడే లక్ష్మణుడికి ఊర్మిళనూ, భరత శత్రుఘ్నులకు మాండవి శ్రుతకీర్తులనూ ఇచ్చి చేసినట్టు 1961 అక్టోబరు సంచికలో ప్రచురించాము.

3. *"మంగళ," నాగపూర్*

అన్నయ్యా, ఇక్కడికి "చందమామ" చాలా ఆలస్యంగా వస్తోంది. కన్నడం, తమిళం కూడా త్వరగా వస్తున్నాయి. ఇదేం న్యాయం?

ఇందులో అన్యాయం ఏమీలేదు. కిందటి నెల తెలుగులో వచ్చిన కథలు ఈ నెల కన్నడ తమిళ భాషలలో వస్తాయి గనక ఆ సంచికలు ముందు విడుదల అవుతాయి.

4. *కుమారి అరాధ్యుల పద్మ, వెన్నూరు*

ఈ నెల ఒక పాఠకుని ప్రశ్నకు మీరిచ్చిన జవాబులో, తెలుగులో కథలు పేజీలు పెట్టగానే హిందీ, కన్నడ, తమిళ భాషలలోకి అనువాదం అవుతాయన్నారు. కాని కొన్ని నెలల క్రిందట హిందీ, తమిళ, కన్నడ భాషలలో కథలు మాకు చేరుతాయి, మేమూ కథలు ప్రచురిస్తామని జవాబిచ్చారు.

రెండూ నిజమే. ఏ భాషలో వచ్చిన కథ అయినా ముందు తెలుగులో ప్రచురణ అయి తరవాత ఇతర భాషలలోకి వస్తుంది.

5. ఐ. సత్యనారాయణమూర్తి, తాడేపల్లిగూడెం

ఏమండీ, భూకంపములు వచ్చునపుడు మొత్తం భూమి అంతా కదల వలెను గదా, వర్షా భూకంపం వచ్చినప్పుడు మన కేవిధమైన చలనం లేక పోవటానికి కారణం?

భూమి అడుగున ఉండే రాతిపలకలో అనేక పగుళ్ళున్నాయి. అది ఏకాండపు పలకకాదు. ఒకే పలక అయినప్పటికి ఒకచోట కంపం ఏర్పడినప్పుడు అది దూరం వెళ్ళినకొద్దీ బలహీనమైపోవటం సహజం. పొడుగైన ఇనపచువ్వను మధ్యభాగంలో గట్టిగా కొడితే దాని అదురు కొట్టినచోట ఉన్నంతగా చివర్ల ఉండదు గదా. అప్పటికి భూకంపాలు కనిపెట్టే సీజ్మోగ్రాఫ్ యంత్రాలు ఎంతో దూరాన కలిగిన భూకంపాలను కూడా రికార్డు చేస్తూనే ఉన్నాయి.

6. కొండపల్లి రామారావు, బి. ఎస్‌సి., అలమండ

ఒక మిత్రు డడిగిన ప్రశ్నకు సమాధానంగా భూమియొక్క భ్రమణవేగం భూమిచుట్టూ వుండే గాలి పొరకుకూడా ఉన్నదని మీరు జవాబు ఇచ్చారు. భూమి నుండి ఎన్ని మైళ్లవరకూ భ్రమణవేగం ఉంటుందో తెలియజేస్తారా?

గాలిపొర భూమికి సమీపంలో మందంగానూ, పైకి పోయినకొద్దీ పలచగానూ ఉంటుంది. స్పూత్నిక్కులు తిరిగే ఎత్తున గాలి అణువులు చాలా ఎడ మెడంగా ఉంటాయి. ఇంకా ఎత్తుకుపోతే "అయానులు" మాత్రమే ఉంటాయి. దీనికి తగ్గట్టుగా ఎత్తుకుపోయినకొద్దీ భూమియొక్క ఆకర్షణశక్తి క్షీణించి పోతుంది. అందుచేత, గాలిపొర అనేక వందల మైళ్ళదాకా వ్యాపించి ఉన్నప్పటికీ కిందిపొరలలో మాత్రమే దాని భ్రమణంగణనలోకి వస్తుంది. ఉల్కలు గాలిపొరలో మండే ఎత్తువరకూ—150-200 మైళ్ళు—గాలి కూడా భూమితో పాటే భ్రమణం చేస్తున్నదనుకోవచ్చునేమో.

7. నం. నందకిశోర్, కాకినాడ

అణువు చిన్నదిగదా, అందులో నుండి విపరీతమైన శక్తి పుడుతుందంటారు. ఎలా పుడుతుంది? ఈ అణుశక్తి వలన ఉపయోగములేమిటి?

అణువుల కేంద్రాలలో శక్తి ఇమిడి ఉంటుంది. ఆ కేంద్రాన్ని పగలగొట్టగలిగితే ఆ శక్తి విడుదల అవుతుంది. ఒక్క అణువులో ఉండే శక్తి ఎక్కువైనది కాక పోవచ్చు. కాని మామూలు పదార్థంలో నుంచి మనం పొందే శక్తి రాసాయనికశక్తి; అదే పదార్థంలో నుంచి మనం అణుశక్తిని తీయగలిగితే అది రాసాయనికశక్తి కంటె అనేక లక్షల రెట్లుంటుంది. అణుశక్తితో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయవచ్చు, కొన్ని వ్యాధులు నయం చేయవచ్చు, అంతులేని శాస్త్ర పరిశోధనలు జరపవచ్చు. అణుశక్తి ఉపయోగాల జాబితా చాలా పెద్దది.

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

బల్లపై బాలుని క్రీడ

పంపినవారు:
పి. ఎన్. మూర్తి, కూ. అగ్రహారం

Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

బాలునిపై చక్రపు నీడ

పంపినవారు:
పి. ఎస్. మూర్తి, కూ. అగ్రహారం

# అర్థంలేని అన్వేషణ ★

[ రామతీర్థ కథ ]

ఒక పేదరాలు ఒకనాటి రాత్రి తన ఇంట్లోనే సూది ఒకటి పారేసుకున్నది. దానితో ఆమెకు అవసరం వచ్చింది. కాని దాని కోసం వెతుకుదామంటే ఇంట్లో దీపంబుడ్డీ కూడా లేదు.

అందుచేత ఆమె వీధిలోకి వెళ్ళి వీధి లాంతరు వెలుగులో వెతకసాగింది. ఆ సమయంలో ఒక మనిషి అటుగా వెళుతూ, "ఏమిటమ్మా వెతుకుతున్నావు?" అని అడిగాడు.

"సూది, నాయనా," అన్నది పేదరాలు.

"పాపం చీకటివేళ కూడానే! ఏ ప్రాంతంలో పడిందో?" అన్నాడు దారే పొయ్యేవాడు.

"ఇంట్లోనే ఎక్కడో పెట్టాను. దొరక లేదు," అన్నది పేదరాలు.

దారే పొయ్యేవాడు ఆశ్చర్యపడి, "ఇంట్లో పోయిన వస్తువు కోసం వీధిలో వెతుకుతావేం?" అన్నాడు.

"ఇంట్లో వెతకటానికి దీపం బుడ్డి లేదు. అందుచేత వెలుతురున్న, ఈ వీధి లాంతరు దగ్గిర వెతుకుతున్నా!" అన్నది పేదరాలు.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: బల్లపై బాలుని క్రీడ

రెండవ ఫోటో: బాలునిపై చక్రపు నీడ

పంపినవారు: పెమ్మరాజు నారాయణమూర్తి,

కూచిమంచి అగ్రహారం, (తూ. గో. జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్ట చివరి బొమ్మ

తన జ్ఞాతులను చంపిన కారణం చేత తాను నరకానికి దారిచేసుకున్నానని దిగులుతో రాజ్యం నిరాకరించిన ధర్మరాజుకు వ్యాసుడు పాపకార్యాలు ఎలా ఉంటాయో, వాటికి ప్రాయశ్చిత్తం ఏమిటో, కాలప్రభావం చేత ధర్మాధర్మాలు ఎలా మార్పుచెందుతాయో వివరంగా చెప్పాడు. వ్యాసుడి మాటలు వింటున్న కొద్దీ ధర్మరాజు మనసు తేలికపడింది. ధర్మసూక్ష్మాలు తెలుసుకోవాలనే కాంక్ష హెచ్చింది. అంపశయ్యపైన ఉండి త్వరలోనే మరణం పొందే ఉద్దేశంలో ఉన్న భీష్ముడి వద్ద ధర్మసూక్ష్మాలు తెలుసుకోవటం ఉచితంగా ఉంటుందని వ్యాసుడూ నారదుడూ అనుకున్నారు.

భీష్ముడి పేరు చెవిని పడగానే ధర్మరాజు, "అయ్యో, తాత అని కూడా చూడకుండా ఆయనను కూడా యుద్ధంలో పడగొట్టాను. ఏ మొహంతో ఆయనను చూడను?" అని దుఃఖించాడు. కృష్ణు డాయనను ఊరడించాడు.

పెద్దలు కోరిన విధంగా పురప్రవేశం చేసి రాజు కావటానికి ధర్మరాజు ఒప్పుకున్నాడు. పదహారు ఎద్దులను పూన్చి, తెల్లని కంబళి పరిచిన రథంలో ఆయన ఎక్కి కూచున్నాడు. భీముడు సారధి స్థానంలో కూచున్నాడు. అర్జునుడు అన్నగారికి శ్వేతచ్ఛత్రం పట్టాడు. నకుల సహదేవులు వింజామరలు వీచారు.

ధర్మరాజు రథానికి ముందుగా, పల్లకీలో గాంధారీ ధృతరాష్ట్రులూ, వెనుకగా రథాలలో యుయుత్సుడూ, కృష్ణ, సాత్యకులూ, వివిధవాహనాలలో ద్రౌపదీ, ఇతర కౌరవ స్త్రీలూ బయలుదేరారు.

అలంకరించిన రాజమార్గంతో, వీధులు నిండిన స్త్రీ పురుషులతో హస్తినాపురం కళకళలాడింది. స్త్రీలు కొత్తరాణి ద్రౌపదినీ, పురుషులు పాండవులనూ పొగడారు. రాజగృహద్వారం వద్ద మంత్రులూ, పౌరముఖ్యులూ ధర్మరాజుకు స్వాగతం చెప్పారు.

ధర్మరాజు దేవబ్రాహ్మణ పూజచేసి, తన గురువైన ధౌమ్యుడికీ, పెద్ద అయిన ధృతరాష్ట్రుడికీ మొక్కాడు. బ్రాహ్మణాశీర్వచనాలూ, దుందుభిమోతలూ మిన్నుముట్టాయి.

ఈ సమయంలో పరివ్రాజకుడి వేషంలో చార్వాకు డనేవాడు, దుర్యోధనుడి పరమ మిత్రుడు, ధర్మరాజు ఎదటికి వచ్చి, "ఓ రాజా, ఈ బ్రాహ్మణులంతా కోరగా నే నీ మాటలు నీతో అంటున్నాను: ఛీ, ఛీ! జ్ఞాతుల నందరినీ చంపి నీ వీవిధంగా ఎందుకు బతకాలి?" అన్నాడు.

ధర్మరాజు సిగ్గుపడి, తనను నిందించ వద్దని బ్రాహ్మణులను వేడుకున్నాడు. అప్పుడు బ్రాహ్మణు లాయనతో, "వీడు దుర్యోధనుడి మిత్రుడు, రాక్షసుడు. వాడు చెప్పినది మా అభిప్రాయం ఎంత మాత్రమూ కాదు," అని చెప్పి, ఆ చార్వాకుడి ప్రాణాలు అక్కడే తీసేశారు. తరవాత ఆ బ్రాహ్మణులు ధర్మరా జిచ్చిన కానుకలు పుచ్చుకుని తమ దారిన తాము వెళ్ళిపోయారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# పనామా

## సౌందర్య సాధనాలు

పనామా సౌందర్య సాధనాలు మీ అందాన్ని ఇనుమడింప చేస్తాయి. పనామా సౌందర్య సాధనాలు — ఫేస్ పౌడర్, టాల్కం పౌడర్, ఫ్రేగన్ టాల్క్, షెప్రాన్ స్నో, పనామా పొమేడ్ — ఇవన్నీ మిమ్ము సౌందర్య జలధిలో జలకమాడిస్తాయి. పైగా నిగనిగలాడే కేశలావణ్యానికి పనామా "బ్రిలియంటైన్" కంటె మరో సాధనం లేనే లేదు!

ముగ్ధ మనోహరత్వానికి






వైజయంతిమాల
జపానీకి హవా చిత్రంలో

పనామా ప్రైవేట్ లిమిటెడ్
కలకత్తా బొంబాయి న్యూ ఢిల్లీ

సోల్ ఏజంట్: లాలా గోపికృష్ణ గోకుల్‌దాస్
114, మింట్ స్ట్రీట్, మద్రాసు - 1.

CHANDAMAMA (Telugu) OCTOBER 1962 Regd. No. M. 4854




మహాభారతం